నరచరితమొ, హరిచరితము
పరిపూర్ణుండైన నరుడె పరమాత్ముండై
పరుడైనారాయణుడగు
హరియా ప్రభుఁగొలుతు సతము నాత్మోన్నతికై॥

రంగనాథవినుత రాకేందుశేఖర
కామమదవిభంగ కంజజనుత
గిరిజాతచిత్తాబ్జ సరసిజ బాంధవా
కాంచనాచలధార కాలకంఠ
నీహారనిభగాత్ర నిర్జరనుతిపాత్ర
నందిరాడ్వాహన సుందరాంగ
నిఖిలయోగివినుత సకలభువనపోష
పంచమోములవాడ ఫాలనేత్ర

నలువపుఱ్ఱెను ధరియించు నగనివాస
రజతశైలేశ శంకరా భుజగహార
సింధుగంభీర యోధీర శిష్టపోష
హరహరయనుచు నుతియింతు నభ్రకేశ
రామలింగేశ నీచింతనామృతంబు
జున్నుకంటెను మధురంబు సుజనులకును



# తొలి పలుకు



ఈ నా చిన్న కావ్యమునుగూర్చి, సహృదయులగు పాఠకలోకమున కొక నమ్ర నివేదనము. మన పవిత్ర భారతదేశమున ఆత్మదర్శకులును, ఆత్మస్వరూపులును అగు మహర్షులు, విశ్వాంతర్గములగు ఎన్నియో పరమరహస్యములను కావ్యరూపమున గానము జేసిరి. * ఆ గానమే వేదమయ్యెను. ప్రకృతిబద్ధుడైన మానవుడు బుద్ధిబలమునాధారము జేసికొని, తర్కగమ్యములగు సామాన్యసత్యములను సేకరించి వాటిని సంపుటీకరించి శాస్త్రములని పేరుబెట్టెను. వాటికి కర్త మానవుడే. కాని ప్రకృతికి అతీతములును తర్కమున కతీతమగు సత్యములకు ఆ పరమాత్మయే కర్త – ఆయన ఆత్మద్రష్టలగు మహర్షులద్వారా వాటిని మనకొసగెను. అందుచేతనే వేదములు దైవ నిర్మితములని చెప్పబడెను.

సర్వజీవాంతర్గతుడగు నాపరమాత్మ సన్నిధిని దీనినొక చిన్న పూజాసుమముగాను, నా హృదయమును నివేదన ప్రసాదముగనుజేసి ఆ విశ్వమయుని కర్పించు కొంటిని. ఇది విశ్వమానవ పరిణామశాస్త్రమున కొక సంగ్రహ వ్యాఖానము; మానవమానసిక శాస్త్రమునకొక స్థూలస్వరూపము; మరియు వేదాంతశాస్త్రమునకు దిక్సూచి.

ఈ చిన్న కావ్య సుమమును, నల్గురిలోనున్న నారాయణుడు తప్పక స్వీకరించుననియు, దీనినల్పమని భావించి తిరస్కరించడనియు దృఢవిశ్వాసముతో సమర్పించుకొంటిని. అవును ఈ గ్రంథరచనమునకు ఆ ప్రభుని ప్రోత్సాహమే తోడుగా నే నీపనికి సాహసించి, ఆ పరమాత్ముని అనుగ్రహబలమున దీనిని నిర్విఘ్నముగా పూర్తిగావించితిని. అందువలన నిది మానవాంతరాత్మ స్వరూపుడగు నారాయణునకు తప్పక ప్రియకరమగునని నా పూర్ణ విశ్వాసము. ఆయన సత్కృతి నాయన మెచ్చుకొనుటలో నబ్బురమేమి యుండును ?

---

N. B. :—వేదములు వాని కావ్యపరిభాష నేను ముందు వ్రాయబోవు గ్రంథములో వివరించెదను.

ప్రస్తుతకాలమున వేదములను, పురాణములను, శాస్త్రములను సమగ్రముగా చదువుటకుగాని వినుటకుగాని యెవ్వరికిని తీరికలేదు. ఇది కేవలము "ఆడంబరయుగము" సత్యమత్యల్పముగను, ఆడంబర మత్యధికముగను చూపట్టుట సూక్ష్మము సర్వజన విదితము. నేటి జన సామాన్యము నిజమగు గొప్పతనమునకై ప్రయత్నించక, తాము గొప్ప వారని పరులు చెప్పుకొనుటకే ప్రయత్నించుటయు, నిజమగు సౌఖ్యమనుభ వింపక, తాము సుఖించునట్లు పరులనమ్మించుటకే ప్రయత్నించుటయు, తాము అశాంతిజీవనము చేయుచు, పరమశాంతిజీవన మొనరించునట్లు నటించుటయు, దయాదాక్షిణ్యరహితులై అసురజీవనము జేయుచు, పరమ త్యాగస్వరూపులుగా నటనచేయుటయు, కేవల అక్షరసంస్కారమైనను పొందకయే విద్యావంతులుగా తమ్ము ప్రదర్శించుకొనుటయు ఈ యుగ మున మనకు సర్వసామాన్యమగు విషయమే. ఈ యుగధర్మమైన దుష్ట ప్రభావ సంస్కారమునుండి తప్పించుకొనువారు కోటి కేయొకరో యుందురు. కావున తెలిసిన పండితులు ఈ కాలమున మనశ్రుతి, స్మృతి, పురాణేతిహాసములందలి ప్రధానవిషయములను సంగ్రహముగా సుందరమైన కావ్యరూపమున, సామాన్య ప్రజలకర్పించుట వారి విద్యుక్తధర్మమని నా నమ్ర నివేదన.

నేను అల్పజ్ఞుడనైనను, సర్వజ్ఞుడనైన నారాయణుని నమ్మి, నరునకు నారాయణునకుగల అంతరువులక్రమమును, మన సనాతన సత్యమునకు ప్రతి కూలముగాని విధమున సంగ్రహముగా వివరింప ప్రయత్నించితిని; సమర్థులగు పండితులనిది ఆకర్షించుననియు, వారు దీనిని యిట్టి మనోహరవిషయముల నెన్నిటినో సర్వాంగసుందరమగు కావ్యరూపమున సంపూర్ణమగు వివర ములతో సాధ్యమైనంత సంగ్రహరూపమున మాధవసేవను మరపించు మానవసేవకొఱకై అర్పించెదరను ఆశయే నన్నీ రచనకు పురికొల్పినది. ఆ నారాయణ కిరణమగు జీవుల నేక పరిణామములుపొంది తామసయుగమున శూద్రులైన ఆదిమానవులుగను, తామస, రాజస మిశ్రమయుగమున వైశ్యులు గను; రాజసయుగమున క్షత్రియులుగను; సాత్త్వికయుగమున బ్రాహ్మ ణులుగను క్రమవికాసముతో పరిణతి నొందిరి. ఈ జీవపరిణామక్రమము నేనిందు సంగ్రహముగా తెలుప ప్రయత్నించితిని.

కించజ్ఞుడను, ప్రాకృత శీలుడును, పండితపాద రేణువునగు నా యీ ప్రయత్నము, సహృదయులగు విబుధుల దీవెనలనందుకొని, సమాజ నారాయణునికొక సేవాపుష్పమగునని యాశించుచు భక్తితో దీనిని సమర్పించుకొంటిని, ఇది నాదురాశగాక సదాశాపూరితమగు సదాశయమని నానమ్రమనివేదనము.

ప్రపంచము పుట్టినదాది జీవులు వ్యష్టిగను సమిష్టిగను యెట్లు క్రమ వికాసము పొందుచూ పురోగమించుచున్నదియో; నిజమగు ఔన్నత్యము, శ్రేయము పొందుటకు మనము నిర్వహింపవలసిన కర్తవ్య మేదియో, అందు మనము వహించిన పాత్రయేమియో అందులకై తెలిసిన మహనీయులు, మానవ జీవితమున అన్నిరంగములలో యథార్థశక్తిని విజ్ఞానజ్యోతుల నమర్చి సర్వసామాన్య ప్రజాసమూహమునకు సహాయపడుటయే మనజీవిత పరమాశయమని ఈ నాచిన్నపొత్తములో వారికి విన్నపము చేయుటయే నాపరమ లక్ష్యము.

ఈ నాచిన్న పుష్పము భావి విద్యార్థులహృదయ పీఠముల నెలకొను నారాయణ సన్నిధిని తన అల్పత్వమును మీరి నిత్యత్వమును గాంచుగాక యని నమ్రుడనై ఆశించుచు నా తొలిపలుకులు ముగించుచున్నాను.

ఇట్లు

సజ్జన విధేయుడు

ఆర్. నరసింహరాజు.

బి. ఏ. బి. ఇడి.

రిటైర్డు హెడ్మాష్టరు

(గ్రంథకర్త)

# పండితాభిప్రాయములు

శ్రీ రంగినీని నరసింహరాజుగారు తాను రచించిన 'నర - నారాయణ' అను తెలుగు కావ్యమును, నాకు సాకల్యముగా వినిపించియున్నారు. కావ్య మంతయు రసవంతముగాను, భావగర్భితముగాను యున్నది. శైలి మృదుమధురము. నరసింహరాజుగారు చాలా ఉత్తములు. మేధావియయ్యు నిరాడంబరమైనవ్యక్తి, వీరి ప్రతిమాటలోను ప్రాసంగికముగాకూడా భావగర్భితముగా, కవితాచాతురి తొణికసలాడుచుండును. ఇట్టివారిని లోకము తప్పక ఆదరించవలసియుండును.

ఈ నర-నారాయణ కావ్యము ఆధ్యాత్మికమేగాక ప్రజావళికి భావికర్తవ్యతా సూచకముగాకూడనున్నది. ఇంతవరకు నరుడేమిసాధించినదియు, యింకముందెద్ది సాధించవలసినదిగా నారాయణోద్దిష్టమైనదియు చక్కగా వర్ణింపబడినది. ఇదియే యీ కావ్యముయొక్క వైశిష్ట్యము.

(Sd.) ధూళిపాటి అర్కసోమయాజి,

Head of the Department of Mathematics,
W. G. B. College, Bhimavaram.

శ్రీ రంగినీని నరసింహరాజుగారు తాము రచించిన "నర-నారాయణ" అను పద్యకావ్యములోని ప్రధానఘట్టములను చదివి వినిపింపగా వింటిని. ఆధునికయుగమున మానవుడు ఆడంబరములకు లోగక మానవసేవయే పరమావధిగా నెంచిన నారాయణుడగుటకు సందేహము లేదని నిరూపించిన తెర గెంతయు ప్రశంశనీయము. కవితా శైలి మృదుమధురమై అందరకు నందుబాటులో నున్న జాను తెనుగులో నెంతయునొప్పారినది. ఇయ్యది సర్వమానవ హృదయరంజకముగా వెలయగలదని యాశించుచున్నాను.

ఇట్లు

(Sd.) T. BULLIAH, M. A., BED.
Nava Bharati Gurukul, Rajahmundry.

# కృతిసమర్పణము



శ్రీసతియు భారతియును
మాసతియును బ్రోతురెపుడు మహిమాన్వితులై
భాసితవేంకట నరసమ
ధీసదనగుణాలవాల దివ్యాత్మనిలన్॥

శ్రీకరంబగు నాంధ్ర క్షితినొప్పు రెడ్డి సీ
మను విలసిల్లు పావనపురంబు
కన్నెపురంబన గ్రాలుసంపదలతో
రెడ్డిసీమకునెల్ల దొడ్డగ్రామ
మందు కమ్మకులంబు నందున్నతోన్నత
మగు గెడాసద్వంశ మలరుచుండు
నావంశక్షీరధి నమృతాంశుగతినొప్ప
ఘన గెరటయ్యార్య కలితకీర్తి
శాలిమన్నెపుదొర సాహసోదార వి
స్తార సద్వితరణ శాలియగుచు
అధికారులకునెల్ల నధికారియగుచును
అనదలకెల్ల తానయ్యయగుచు
ధీరులందెల్ల తాధీరవరేణ్యుడై
భక్తజనాళికి భాగ్యమనుచు
జ్ఞానులందెల్ల ప్రజ్ఞానియై వెలయుచు
పగతురగుండెలో బల్లెమగుచు

బంధువర్గమునకు భాగ్యంబుగానోచు
నాశ్రితావళికెల్ల నండయగుచు
లక్ష్మీసమాన విరాజిత సుభద్రమ్మ
పరమపావనియైన పడతిమిన్న
అర్ధాంగి లక్ష్మియై యలరుచు నిరువుర
సుతలనుగాంచెను సురలుమెచ్చ
వేంకటరత్నాంబిక విమలజ్యేష్ఠతనూజ
శ్రీ వేంకటనరసాంబ చిన్నపుత్రి
అక్క-శ్రీ వేంకటరత్నాంబిక శ్రీమద్ది
పాటివంశముకీర్తి వరలనొప్పి
భువివీడి పుణ్యంపు దివిజేరెజననన్ను
తులగాంచి యమరకీర్త్యమరఁజేసి
శ్రీ వేంకటనరసాంబ శ్రీకానుమిల్లి స
ద్వంశాబ్ధిచంద్రుడై వరలుఘనుడు
న్యాయవాదిగనొప్పి న్యాయాధిపతియైన
జగ్గరాడ్విభునకు సతిగనయ్యె
ఆ మహామహితాత్మ యమలచిత్తాబ్జసా
ధ్వీలోకసన్నుత దివ్యమూర్తి
పతినాకవాసము బడసినకతమున
కన్నవారింట ప్రకాశమగుచు
ధన్యకన్నాపుర దాతగావెలయుచు
శ్రీ గెరటార్యుల చిన్మయాత్మ
యగుచు గ్రామంబున కాత్మయైతల్లియై
పేదసాదలకెల్ల ప్రియముతోడ

జ్ఞానమానంబులు పూనికతనుగొల్వ
నిహయాత్రసాగించు నింపులొలుక
దానంబు తనయాత్మ ధర్మమైభాసిల్ల
నిరత వదాన్యయా నిర్మలాత్మ
సంతతిలేదని సంతాపమొందక
బంధువర్గములోని బాలికలను
పెంచిపెండిండ్లుగావించి సంతసవార్ధి
మించి జీవనమాచరించుధన్య
పుణ్యులౌపితరుల పుత్రుడు పుత్రియు
తానుగా భాసిల్లు ధర్మచరిత
ఉభయవంశములకు నున్నతసత్కీర్తి
చేకూర్చుచున్నప్రసిద్ధమూర్తి
కార్తికమాసాన ఘనవైభవంబుతో
వేలకన్నము పెట్టు విభవపూర్ణ
అధికారివర్గంబు అడకువతో తన్ను
పూజింపనేర్చిన పుణ్యచరిత
బంధువర్గములెల్ల బహుభక్తితనుగొల్వ
జీవనంబొనరించు ధీవరేణ్య
సంకల్పసిద్ధితో సత్కార్యనిరతియై
ప్రజలమన్ననలందు పరమధన్య
శ్రీయాంధ్రయూనివర్సిటీకి దానంబుగా
పాతికవేలు ద్రవ్యంబునొసగ
కాకినాడపురాన గట్టిన మెడికలు
కాలేజికైదువే లక్షలిడెను

ఏలూరుపురమున నేర్పడ్డ సైంటెథె
    రిస్సాగరల్ స్కూలు కెలమినొసగ
అయిదువేల్వరకు రూప్యాలు కోయలగూడె
    మందు శ్రీగెరటయ్య మాన్యతముల
పేరునహైస్కూలు పెద్దగానిర్మించె
    అచటిహాస్టలుకుననల్పమైన
ఒకవార్డు బిల్డింగు యొప్పారగట్టించె
    కన్నాపురంబున ఘనతమీరు
గ్రంథాలయమునకు గట్టించె భవనము
    శివశంకరుని పేర చెన్నుమీర
ఎలిమెంటరీస్కూలు కేర్పర్చెనొక పెద్ద
    భవనంబునెంతయు బాగుమీర
కట్టించు నికమీద ఘనమా అనాథ శ
    రణ యాలయంబు విరాజితముగ
దానికినొసగును దానపూర్వకముగా
    పల్లమైదెకరాలు పైనమెరక
ఎనిమిదియెకరాలు యేకఖండముగాగ
    ప్రజలును స్వామియు బ్రస్తుతింప
కోరుకొండ పురాన చారుతరాశ్రమం
    బునకిచ్చె పదివేలు ఘనతవెలయ
మదరాసులోనొప్పు మానితకేసరి
    హైస్కూలునకునిచ్చె నారువేలు
మరియునెన్నెన్నొ గుప్తమౌ మహితదాన
ముల నొసగెరెండు వంశము ల్వెలయునట్లు

తల్లిదండ్రుల పుణ్యమీ ధరణినిట్లు
వేంక్టనరసాంబ రూపాన వెలయునేడు॥

నరనారాయణులను నీ
వరరచనము నాదు కావ్య బాలనుదీనిన్
వర వేంకటనరసాంబకు
స్థిరముగ నంకితము జేతు శ్రీపతి యలరన్॥

"అవలబోయిన వెన్క నాడు ఎన్నడు లేదు
మొగము ముందరనంట మొదలె లేదు
మనవి జెప్పిన జేయ కునికి యెన్నడు లేదు
కొదవగా నడుపుట మొదలె లేదు
చనవిచ్చి చౌక చేసినది యెన్నడు లేదు
పదిరి హెచ్చించుట మొదలె లేదు
మెచ్చిన చోకొంచె మిచ్చు ఎన్నడు లేదు
మొగమిచ్చకపు మెచ్చు మొదలె లేదు

కమ్మకులమందు భాసిల్లు గరితమిన్న
కానుమిల్లి సద్వంశాబ్ధి కాంతిరాశి
శ్రీగడావంశ వార్ధికి శ్రీలలామ
వేంక్టనరసాంబకీకృతి వేడ్క నిడుదు॥

పెంచిన పుత్రికలట్లే
అంచితమా కావ్యకన్య నాదరబుద్ధిన్
పెంచుము తల్లీ యిదియ
ర్పించును సత్కీర్తి మీయభీష్టము వెలయున్॥

తెలుగు దేశానికెల్ల మీ వెలుగునిండు
దేశ దేశాలలోన మీ తేజమలరు
తరతరములుండు మీదు వితరణగుణము
అందుకోవమ్మ తల్లి నాయనుగుసుతను

పరమపావని మీ హృదాబ్జమున వెలయు
అల్ల నారాయణుని భర్తయనుచుగోరె
పెంచిదీనిని యర్పించ వమ్మస్వామి
కనవరతమును భాసిల్లు ఘనతమీర॥

జయము శ్రీ వేంకటనరసాంబ జయము జయము
జయము నారీలలామమా! జయము జయము
జయము మాతృస్వరూపిణీ జయము జయము
జయము సుజ్ఞానభాసితా జయము జయము

---

# కవి వంశావళి



శ్రీసుబ్బరాజుకు చిన్నారిపుత్రుండ
ఘనమహాసరమ్మకు కన్నసుతుడ
భట్లల మగటూరి పావనవసుధనే
పుట్టుకగాంచిన పుణ్యభూమి
భట్టశబ్దంబుచే బరగుక్షత్రియకులం
బందున నాజన్మమంది వెలయు
రంగినీనిసునామ రాజితాన్వయము నా
తనువుగాంచినయట్టి ధన్యవంశ

మాంగ్లమున పట్టభద్రుడనైతి పిదప
భవ్యమైన యుపాధ్యాయ పదవికొఱకు
వలయు బియ్యీడి పట్టంబు బడసినాడ
కాలమంతయు బోధలో గడిపినాడ

తాతలు తండ్రులున్కవులు ధన్యులు పండితమాన్యులౌచు సం
ప్రీతిగ సద్యశంబుగొని పెంపలరారిరివారిసత్తపో
జాతఫలంబునేకవిత సల్పగ కోరికగూర్చె యింతకీ
చేతలకెల్లతొల్లికృత చిత్తము సద్గురుడౌచు తోడ్పడెన్॥

మండలాధిపు మెప్పించి మాన్యములను
ముప్పదెకరాలు కానుకగా పొందెతాత
మరియు కరిణీకమబ్బెను మాకునాడె
కవితకరిణీకమిడిమాకు కలిమిగూర్చె॥

బాల్యమున తండ్రి పరలోక వాసుడవగ
మాదుపెద్దన్నతండ్రియై మమ్ముబెంచి
విద్యావరకు నన్జదివించి పెండ్లిజేసి
నాదుభార్యను బిడ్డల నాదరించి
చక్కగా జీవనోపాధి సంతరించి
వర్ణమునకెల్ల సత్కీర్తి వరలునట్లు
గ్రామకరిణీక మొనరించి ఘనముగాను
అందరిన్వీడి దివిజేరె నద్భుతముగ
అట్టివానికి శ్రీహరీ! ఆత్మశాంతి
పుణ్యలోకములిప్పించి పూజ్యముగను
వానిసుతునకు సద్బుద్ధి వచ్చునటుల
కాచి రక్షింపవినుతింతు కమలనేత్ర
రామ రవికులసోమ శ్రీరంగధామ॥

కవి తాత రామరాజుగారు రచించిన ఉత్పలమాల.

శ్రీరజితాచలేశ్వరుని చిత్తములో నిరతంబునమ్మి బం
గారపు పూలపూజలనఘాత్మతతో నొనరించు పుణ్యసం
చారిఅనంతవేడ్కసువిచారణ శారదరాజకార్య గం
భీర సముద్రభూరికవి బీదజనాశ్రిత పారిజాత పం
కేరుహమిత్రతేజ సురకేసరి యేలురుబస్తికల్కటర్
గారి సిరస్తదారు రసికాగ్రణినేమిమునాశ్రయించినా
కోరికవృత్తమాలికలోగూరిచి మౌక్తికహారలీల వి
స్తారముగా రచించివిరిదండసువాసనలుప్పతిల్ల వా
గ్ధారనుజట్టి తెచ్చితిని దానముగా మదిలోనదల్చి ప

ల్మారులు నన్నుబ్రోవు కృప మానక నెప్పుడు మైలవర్పువం
శోరుహసోమయ ప్రభునశోగురు నామనవాలకించు మా
వారిలోమున్ను రంగినిని వంశసుభూషణలింగరాజు స
త్కారణమైన కుల్కరిణి ఖాయముగా తన పేరుదెచ్చుకొ
న్నారట వారిపిమ్మట సనాతనుడౌవర పేరరాజు ఝాం
కారముగాను మిక్కిలి సుజాగ్రతగాతన తండ్రిపేర సా
ధారణగా లిఖించెను సదామలచిత్తముతోడ రామరా
ధీరుడు వ్రాసెనంతటను దివ్యమతీంద్రుడు పద్మరాజు మం
జూరికివచ్చినాడతడు సూనృతవాక్యనృసింహరాజు ల
క్ష్మీరమణీ కటాక్షుడు సమీరసుధీరుడుగాన విద్యకున్
నారద తుంబురుల్ సముడు నామకపల్లము రాజు వ్రాసెనా
సారనుబట్టిరామకవి సాంద్రుడునై నటువంటి నేను నా
దారిని వ్రాయుచుండగ అధర్ముడు అగ్గెల సుంద్రరావహం
కారము చేతనా కరిణికానికి కర్తవపాటి గ్రామ సా
కారునిబంపినాడతడు కారణకారిగనాదెతాను నా
యూరికి లీష్టుదారునని యూహనుబట్టియు నర్జివ్రాసి దొ
ర్వారికి యిచ్చుకొన్నతరువాతను నాపురిలింగధారి నా
యూరికితానువచ్చి యిదు వుంచకనాపొలమంత హెచ్చు
కొల్వారముగొల్చి భూమినిజ హస్తపులెఖ్ఖడిమెండు జేసి క
న్నారగ జూడకున్న పరమార్థముమాని విశేషసామ్ములయి
న్నారు పురాగతస్కరణ నూకెను రెంటలబాలయాఖ్యుడున్
చోరునియొక్క చిత్రములు చోద్యముగాగ ప్రబంధశయ్యలో
జేరిచిచెప్పవచ్చునవి చర్చరజూచినవన్ని కూర్చి మా
భారము మీదెయంచుప్రతి భాషణలందున మీకునే నము

స్కారముజేస సర్వజన కారణకర్తలటంచు వేడి వే
సారి కుచేలుకోరికసౌసామణిజేసినరీతిమీారు వి
స్తారముగారచించి ధన ధాన్యసమర్థునినన్ను జేసి తే
ధారుణినే బజారునిడి ధర్మసు దేశములందు కీర్తిసం
స్కారులయోలగంబుల ప్రకాశముగాగణుతింతు తొల్లి స
ర్కారుసిరస్తదారుతణి కెల్లకులాగ్రణి తణుకుతాహసిల్
దారులోనుండె మేటిసరదారుడు జే జగన్నాధరావుకున్
చేరిన యీారికార్డుతము చేకొని జూచిగ్రహించి బాల యు
క్రూరపుచర్యకాప్రభుడు క్రోధమునొందక కాకినాడ దొ
ర్వారి హుకుంప్రకారముకమాయిషుచేయుటకాడకేగ నం
తారసికుండు పూర్వోతర మందున తణుకులో నేర్చురీతినే
నేర్చిన గూర్చి సర్వజన స్థానములందున భోరుకొల్పితిన్
పూర్వపుసత్కృతికంటె నూటపదార్లువిల్వగల నూతనసృష్టిగ
వృత్తమాలికల్
సారనుబట్టిదెచ్చితి విశాలపు యూహను మీాకుకానుకల్
కూరిమితోడ దెచ్చితిని కోపముచేయక చిత్తగించుడీ॥
వారిద వాహవైభవ దివాకరతేజ ధరామరాణ్మం
దార యశోవిశాల వరదాత్మక మమ్ములమీాకుమారులున్
ధీరతబ్రోచినట్టి జగతిన్ననుబ్రోవుము విప్రవర్య వి
ద్యారచనప్రవీణవర దానకళానిధిసోమయాగ్రణీ॥





ఈ గ్రంథ ముద్రణకు

సంపూర్ణ ద్రవ్యసహాయ మొసర్చిన

**శ్రీమతి కానుమిల్లి వెంకటనర్సమ్మ జమీందారిణిగారు,**

**కన్నాపురం,**

పోలవరం తాలూకా, ప. గో. జిల్లా,

# విషయసూచిక

శుభమస్తు.  శ్రీరస్తు.  అవిఘ్నమస్తు.

# నర - నారాయణ చరితము

## ప్రస్తావన

శ్రీకరమై ప్రభాకలిత చిన్మయ పూర్ణవిలాస నిత్య శో
భాకరమై కృపామయ మపార మనోజ్ఞ విశేష సత్య సు
శ్లోకపదాంచితార్థము విశుద్ధము బుద్ధమునైన శక్తి నా
లో కవితాస్రవంతినిడ రూఢిగ నెంచి నమస్కరించెదన్॥

ఆ పరిపూర్ణ మందునొక యంశగ నుద్భవమంది నిత్యము
ద్దీపితమౌచు ముందున క దేపనిగాఁ జనుచున్న జీవిలో
దీపమురీతిగా వెలసి దివ్యపదోన్నతి గూర్చునట్టి దే
దో పరమార్థమై వెలయు నున్నతశక్తికి కేలుమోడ్చెదన్॥

ఈ యిహయాత్రలో సతత మెప్పటికప్పుడె తోడునీడయై
ఛాయగనిల్చి జీవుల కశాంతిని, శాంతినిఁ గూర్చునట్టి యా
మాయకు మాటిమాటి కనుమానము వీడి నమస్కరింతు నా
ధ్యేయమునందు తోడ్పడి సుధీజనసన్నుతి నాకు గూర్పగన్॥

నరుడధీరుడు సంశయాకరుడునగుట
నతులొనర్పగఁబనియేమి నరులముందు ?
అతనియుదరంబులో సర్వమమరుకతన
అల్లనారాయణునిఁగొల్చుటరయ నెట్లు?

నరనారాయణ చరితము
ధరలో నిత్యంబునడుచు ధార్మికచరితం

బరసిన పౌరాణికమా!
పరగునదియే విశ్వమందు భాసితమగుచున్॥

నరుడు నారాయణుడు లేని చరిత మొకటి
కలదె? కల్గునె? యేనాటి కైనగాని
అరయగాలేము ప్రత్యక్షమైన కతలు
పాత్రముల కతలతోడనే పాత్రమనకు

ఆత్మదృష్టితో జరుగునంతచరిత
మరయ నారాయణునిదిగా కన్యమగునె?
స్వార్థదృష్టితోఁజరుగు సర్వంబు జగతి
నరుని చరితంబుఁగాక యనన్యమగునె?

నల్గురఁగ్గలిగెడి నారాయణుడు జీవ
రక్షణంబు కొఱకు దక్షుడైన
వ్యక్తిరూపమొంది శక్తిజూపించుట
అతని చరితగాకఁ నన్యమగునె॥

అతడనంతాక్షులనుఁబూని యరయకున్న
అతడు జాగృతిరూపుడై యలరకున్న
నరుడు దైత్యుడై భువనాల నాశనంబు
క్షణములో సల్పగల్గుట సాధ్యమగునె?॥

అనయము నాత్మరూపముగ నన్నిటఁదానయి, జీవకోటులన్
దనుపుచు, స్వేచ్ఛమై బతుకుదారినిగూర్చను, దారిఁదప్పుచో
పనిగొని శిక్షగూర్చి, తన పాలన కెందునఁనడ్డులేక నీ
జనముల సంఘటించు హరి సత్యపుమూర్తి నెరుంగశక్యమే?॥

తానొక సూత్రధారియగు తక్కినజీవులు పాత్రధారులై
జ్ఞానము దీపమై వెలయు చక్కనివిశ్వము రంగభూమి య
జ్ఞానవిశేషవర్ణమయ కామ్యముల న్తెరలందుఁగూర్చు నీ
మానితమైన నాటకము మాధవు సచ్చరితంబుగాదొకో?॥

ఆది యంతము లేదు కాదు ఔనన రాని
దేమి యీఖేలన మెంతవింత !
తెలిసినట్లేయుండి, తెలివికందకయుండు
నేమి యీఖేలన మెంతవింత !
ప్రత్యక్షమగుకొంత ప్రచ్ఛన్నమగుఁగొంత
యేమి యీఖేలన మెంతవింత !
నిశ్చయంబే లేని నిర్ణయపూర్ణమా
ఏమి యీఖేలన మెంతవింత !

నవ్వ నవ్వించి, యేడ్పించి, నాట్యమాడ
జేసి, తెరలను దాటింప జేసి, తుదకు,
ఆటనాడించు తనతోడ నైక్యమొసగు
నేమి యీఖేలన మహత్వ మెంతవింత !

ఈయిహయాత్రదాటువఱ కించుక శాంతియుతృప్తిలేదు, యీ
మాయతరింపగా నరుని మార్గపుదీపము సత్యమైన యా
శ్రేయమతీతమై వెలయు చిత్రము ! దాని నెఱుంగునంతకున్
తీయని విశ్వరంగమున దీనుడు మానవుడూహ సేయగన్ ॥

నరుడొక కిరణము గమ్యం
బరయగ నారాయణుండె యగు చివరకు; నో

తెరవరులారా ! నడుమను
తెరలున్నవి భక్తివానిఁ దీయును ధృతితో॥

ఆతని యంశమైన నరుడస్త్రములెన్నియు జేయనేర్చె నీ
భూతలమందు; నింక పరిపూర్ణుడు స్వామిమహాత్యమెంతయో
ఏతరినైన మానవుల కించుక యూహకునబ్బ నేర్చునే
పూతచరిత్రుడాహరి ప్రపూర్ణకృపామతి నేలకున్నచో॥

నరనారాయణ సచ్చరిత్ర పలుకు న్నాయందునంగల్గు నా
వరమాతత్కారణంబె; మీ మతులలో భాసిల్లు నాదేవు స
త్కారణంబే, విను; శ్రోతలార ! యికపై దివ్యార్థ సంధానులై
పరమార్థంబును శ్రద్ధతోవినగనే ప్రార్థింతు నమ్రుండనై.



శ్రీరస్తు　　　శుభమస్తు　　　అవిఘ్నమస్తు

# నర - నారాయణ చరితము



## ప్రథమ సోపానము



(జడ, జీవ పరిణామము)

కనుదెరసిన నొక విశ్వము
కనుపించు ననంతమై యగణ్యంబగుచున్
కనుశక్తి రూపమేమో
కనుగొనుటే ప్రశ్న; దాని కథ యీకథయే ॥

కనుమూసిన నొకలోకము
కనుపించు ననంతమై ప్రకాశంబగుచున్
కనుశక్తి రూపమేమో
కనుగొనుటే మానవునకు గమ్యంబిలలో ॥

ఆకాశమననేమొ అందుండు నక్షత్ర
రాసులకథలేమొ భాసమాన
మైనకాంతులతోడఁ నవివెల్గులీనుచు
మనకు కన్పడునట్టి మర్మమేమొ ?
అవియెట్లు నిలచెనో అంతరాళములోన !
అందుఁగల్గిన యట్టి యంత్రమేమొ ?
సూర్యుని కథయేమొ ? సోమునికథలేమొ
గ్రహరాశి సంబంధ గాథలేమొ ?

ఆదిగాఁగల్గు కనుపించుఁ నద్భుతముల
నరుడు విజ్ఞానదీప్తిచే నరసినేడు
తెలుపుచున్నాఁడు మరికొంతఁ దెలుపఁగలఁడు
అయిన నదిపూర్ణ విజ్ఞాన మనఁగరాదు ॥

కలలని, కల్పనలని యూ
హాలఁదోఁచినలోకమందు నమరిన కథలన్
విలసితగతి వర్ణనమున్
సలుపఁగలిగె విజ్ఞతాప్రశస్తిఁ బడయుచున్ ॥

అరయుచున్నయట్టి యప్రబంపుచిత్రాల
కంతరంగమందు ననవరతము
తెలివికందునట్టి దివ్యచిత్రాలకు
నడుమ బ్రతుకుచుండు నరుడుసతము ॥

వెలుపలి లోపల జగముల
కలయికలో నరుని బ్రతుకు గమ్యము కొఱకై
నలుగుచు నలరుచునుండుట
తెలియమె సతతంబు, తేట తెల్లముగాఁగన్ ॥

తారకలమాటయటులుంచి ధరణిలోని
జీవతతిగూర్చి మొదట యోచింతమయ్య;
ఎనుబదియు నాల్గులక్షలం చనుచు దెల్పి
రార్యులల వానిభేదము లరసితొల్లి ॥

జీవములుగాఁగ తనుసిద్ధిఁ జెందుముందు
రాళ్ళమైయుంటిమొకనాఁడు రాణదనరి

రాళ్లలోఁగూడ శక్తి విరాజితముగ
కనులఁబడుయత్న మొనరించి కాంచు నెడల ॥

ఒకశిలఁజంపును ఊరకముట్టిన
ఒకటి జీవములిచ్చు నుత్తమాత్మ:
పాషాణమొక్కటి బహుళోష్ణతత్వము
ఒకటి శీతలతత్వమూహఁజూడ
ఒకటి సుందలమౌచు నొప్పారుచుండును
ఒకటి వికృతితోడ నొప్పుచుండు
ఒకటి కర్కశము వేరొకటి శిరీషకు
సుమ పేశలసమంబు సొంపునింపు

ఒకటి కాంతులనీనుచు నుత్సహించు
నొకటి మాడినరీతిగా నుద్భవించు
అన్నిటికి నన్ని యాత్మలై యనవరతము
పలుకకే పల్కునూహలో కలసి మనకు॥

జాయివలె మాటలాడడు రా! యటన్న
పలుకు ప్రాతదె; రాళ్లమై బ్రతికియుంటి
మట్లుగాకున్న తోడి జీవాళి శ్రమల
నరసి మానంబు, బూనగా నలవియగునె?

శిలనారాయణుడంచు మ్రొక్కెదమిదే చిత్రంబు సత్యంబుగా
శిలలందు న్జననంబుగాంచితిమి ; యోచింపన్న శక్తియే లేక, యే
శిలలై యుంటిమొ! యాలయంబగుచునా శ్రీనాథునర్చించునా
తొలిపుణ్యంబిటు నూత్నజన్మలిడె నింతో యంతో
యోచింపగా!

అంతట వేరువేరు విధమౌ ఖనిజంబుల జన్మయబ్బె; నా
వింతలు మానవావళి కభీష్టముదీర్చెడి జీవనంబులో
కొంతకుకొంత పెత్తనముఁగూర్చె జగంబున ; దానిచేతనే
ఇంతయొ యంతయో ప్రజకు నించుక సేవను జేయనబ్బెడిన్ ॥

మానవసేవే నిజమగు
మానిత మాధవుని సేవ మహిమాన్వితమౌ
పూనికఁజడజన్మంబును
బూనక జీవములయందుఁ బుట్టితిమటుపై

ఖనిజ జగంబులన్విడచి గణ్యతగాంచెడి జీవజన్మలన్
గొని యచరంబులై నరుని కూటికి గుడ్డకునైన జన్మలోఁ
దనిసితిమంతచెట్లుగ; ముదంబిడినారము దేహమిచ్చి యీ
మనుజులగొల్చి దారువులమై ఫలరాసినిగూర్చి నిత్యమున్॥

భవననిర్మాణాన బాల్గొని యొకచెట్టు
నరుసేవ నొనరించె నాణ్యముగను
స్వామి యాలయమున స్తంభమై యొకచెట్టు
బహుళ పుణ్యంబునుఁ బడయగలిగె
నావయై యొక్కటి నరులకుఁదోడయి
ఘనతరపుణ్యంబుఁ గాంచగలిగె
ఘనపేటికాకృతిఁ గాంచి సేవలఁజేసి
యికనొండు త్యాగియై హెచ్చగలిగె

ఇటుల భూజజగంబునఁ నెలమితోడ
సేవల ఫలంబుఁగొని తెచ్చె జీవజగతి

నాటినుండియు నెనుబది నాల్గులక్ష
లైన చరజీవజగతిలో నలరినాము॥

జలచరములుగా మరి భూ
తల చరములుగాఁగబుట్టి తరియించుచు నా
వలవాయుచరులమై, దివి
వెలయఁగ చరియించినా మభీష్టముదీరన్॥

పాములమై నాడు పగబట్టి నరులను
కాటుతోఁజంపుచే ఘనతయయ్యె
వనపతియైజంతువర్గంబుకంపింప
కాననంబేలుచే ఘనతయయ్యె
మకరమై గజమైన మనకుదాసోహమం
చనజలమేలుచే ఘనతయపుడు
చిలుకయైయాకాశ సీమనువిహరించి
మనుజోక్తులాడుచే ఘనతయపుడు

వేలు లక్షలు జన్మాల వెనుకనిపుడు
అల్ల తొలిజన్మ పుణ్యాలవల్ల తుదకు
గోవుజన్మంబు ప్రాప్తించి గుణము కుదిరె
నరుని జన్మానకిది మార్గమనిరి మునులు ॥

వారలమాట సత్యమనవచ్చును గోకుల మాత్మబంధువౌ
తీరున మానవావళికి తియ్యని పాలనొసంగు బిడ్డకున్
కోరికగప్పి త్యాగమున గోప్యగుణాకర దేవమూర్తియై
పరివశంబు వానిగుణ మెన్నగ సత్యము నూహసేయుచో ॥

"ఎద్దులేక పంటలెటువచ్చు నరునకు
యంత్రయుగమురాని యపుడు తలప?
ఎద్దుచేయుసేవ యింతింతయన వశ
మౌనె? ఋణముదీర్ప నౌనె మనకు?

పసరము వాహనమట యా
బసవేశున; కెద్దునడచు వసుధ శివంబై
పసమీరు పంటలచ్చెడి
పసిడిగదే? పశువు నరుని బంధువుగాదే?

ఎంతప్రసన్నతా కలిమి! ఎంతటియోర్పు! అయారె గోకులం
బెంతటికీర్తిపూర్ణమగు! నెంతటిశాంతము! దాననేకదా
యంతటి పూజలన్బడయు నప్పుడు, నిప్పుడు, నెప్పుడైన నే
వంతలుగానిదీరు శుభవాసిత గోవదనంబు గాంచినన్

గోపాలుడైన శౌరియె
భూపాలుర మన్ననలను బొందెఁదొల్లి తా
నాపాత్రబూని నరునకు
దీపితమగు తనదుమహిమఁ దెలుపగలేదే?

పంచగవ్యాల మహిమము నెంచఁదరమె?
వైద్యశాస్త్రార్థమెరిగిన వారెగాక,
అమృతమను పేరుగలవస్తు వవని నొక్క
టున్నదిపాలుగాక వేరెన్నవశమె?

వివిధ చరా చరంబులగు వేషములబ్బినమీఁద నేడు నీ
యవిరళమైన యాత్రకొక యంతరువచ్చెను గోవుజన్మతో

వివిధములైన క్రియాకృతులు వింతగఁ శుద్ధినిగాంచి యేదియో
ప్రవిమలభావమై. నరుని పాత్రకు నాందిలభించెనింతకున్ ॥

క్షణములోఁ బుట్టుచు క్షణములోపలగిట్టు
నేవేవో జన్మము లెత్తినాము ;
గంటలోపలఁ బుట్టి గంటలోపలఁ గిట్టు
నేవేవో జన్మము లెత్తినాము ;
రోజులోపలఁ బుట్టి రోజులోపలఁగిట్టు
నేవేవో జన్మము లెత్తినాము ;
జాములోపలఁబుట్టి జాములోపలఁగిట్టు
నేవేవో జన్మము లెత్తినాము ;
మాసములలోన జన్మించి మాసమందె
గిట్టు జీవులలోపలఁ బుట్టినాము
చావుపుట్టుక లొకయేట జరుగునట్టి
ప్రాణులందున జన్మింప వలసెమనకు ॥

పదియేడు లిరువదేడులు
ముదమున ముప్పదియుఁనిటుల మొనకొనిఘనమా-
పదిలమగు జన్మలందున
పదులదాటి శతములోన బడితిమి క్రమతన్

రాళ్ళలో వృక్షములలోని యేళ్ళఁగొలువ
లేము ; చిరజీవనముఁ జేసినాము నాడు ;
ఇపుడు చరజీవనమునఁ జీవించుమాద్దు
కొంత తక్కువ ; క్రమముగాఁ గొంత హెచ్చు ॥

సచ్చిదానందమూర్తియౌ స్వామినుండి
విడువడినమీద నొక పెద్ద నడకనడచి,
యెన్నొయనుభవాల్ గడియించు కొన్నమీద;
నబ్బె నరజన్మకాదియౌ నావుజన్మ॥

కసవుమేయుచు గింజ కడగంటఁగనఁబోక
నరున కేయర్పించు ననఘుజన్మ!
చిట్టునే సాపడి గట్టిబియ్యంబును
నరున కేయర్పించు ననఘుజన్మ!
కడుగుమాత్రమె ద్రావి ఘనమైనయన్నము
నరున కే యర్పించు ననఘుజన్మ!
ఆకులలంబులే యారగించుచు ఫలాల్
నరున కేయర్పించు । ననఘుజన్మ!

త్యాగము, పరిశ్రమంబును ధర్మవృత్తి
దానమునుఁ, కరుణయెరుగు యదార్థ వృత్తి,
గలిగి పశువులమైనను క్రమమువిడక
బ్రతికియుంటిమి యిహపరం బతుకుపడగ॥

కొట్టినఁగొట్టఁబోకఁ, మరి కోపమెరుంగక, నోరువిప్పకన్
తిట్టినఁదిట్టఁబోవక, సుధీవరసన్నుతమైన శాంతమున్
గట్టిగ, సాధనన్నలిపి గాంచితిమందలి మెప్పులింక పై
మెట్టును జేరగల్గితిమి మేటిఫలంబిదు మానవాకృతిన్

వానరజాతినుండి నరువైఖరి గల్గెనటంచు నూత్న వి
జ్ఞాని యొకండుపల్కెఁ; నది కాదవునంచనరాదుకాని, సు

జ్ఞానప్రపూర్ణులైన మునిగణ్యులు చెప్పిరి తొల్లియాత్మవి
జ్ఞానముతోడ నీ నరవికాస క్రమంబును దివ్యదృష్టితో॥
తెలివికొకింత దీప్తినిడి తేరినమీాదటఁ గొంతయోచనన్
సలిపిన విశ్వజీవముల సామ్యతలన్నియు మానవాళిలో
కలిగిన సత్యమున్దెలియ గల్గెద; మిద్దివిచిత్రమైన నీ
పలుకులఁ ద్రోసిపుచ్చుటకు బాటలు కేవల తర్కవీధిలో॥

చిలుకలరీతిగాఁ పలుకునొక్కొకసారి
శునకమై మొరిగెడి చొప్పొకప్డు;
సింహమురీతి గర్జించు నొక్కొకసారి
హయమట్లు సకిలించుఁ నప్పుడపుడు;
మేకలరీతి మెమ్మెయను నొకయప్పు
డొకయెడ నొంటె యట్లూరకుండు;
పామట్టులొకసారి బాగుగాబుసకొట్టు
వృషభముగతి రంకెవేయు నెపుడొ;
పిల్లివలె నల్లివలె బహు తల్లడిల్లు;
బల్లివలె కదలకుండనేఁ పండియుండు;
పరుగులిడు లేడిరీతిగా నరుడొకప్డు;
వెనుకజన్మల ఛాయల విధముఁదోప.

నరునిలోపల నిత్యము వరలునట్టి
యన్నిభావముల్ జీవులయందు గల్గు;
కానికల్పనల్ ప్రకృతిన్గడచు నేర్పు
నరునకేగూర్చె శ్రీహరి పరమకరుణఁ॥



శ్రీరస్తు　　శుభమస్తు　　అవిఘ్నమస్తు

# నర - నారాయణ చరితము

## ద్వితీయ సోపానము

(చాతుర్వర్ణ వ్యవస్థాబీజారోపణము)

నరునకు నారాయణునకు
కరములుజోడింతు నాదు కావ్యమువెలయన్
నరుడే నారాయణు డా
హరియే నరుడౌనుకాల మయ్యెడి పట్లన్

పసివానిగా తొట్లఁబండియుండిన యప్పు
డలయోగనిద్రలో నమరెశౌరి;
మరికొన్నినాళ్ళకు మందహాసంబుగా
నరునిలో నాహరి నాట్యమాడె;
ప్రాకులాడెడు నప్డు పసికందు నుత్సాహ
మై శౌరి నరునిలో నలరెమిగుల;
ఆటలాడెడు బాలు నందు సంతృప్తియై
నరునిలోపలస్వామి వరలెనపుడు;

యువకుఁబ్రబవేచ్ఛలోపల నొప్పి వెలసె;
మరల కౌమారదశను సమ్మానవాంఛ
యయ్యె; నటుపైని వార్ధక్యమందు నరుని
జ్ఞానరూపుడై భాసిల్లె పూనిస్వామి;॥

పాలలో వెన్న కలిగిన పగిది, దారు
వందు నగ్నియు నున్నట్లు హరియు, నరుని
యంతరంగంబు నందున నణఁగి మణఁగెఁ
దొలుతఁ బ్రకృతి వికాసము కలుగువరకు॥

ప్రకృతిబద్ధుఁడగుచుఁ బశుపక్షిక్రిమి కీట
కాళి బోలెనరుఁడు నాత్మమహిమ
నెరుగలేక మూర్ఖుడై తొల్తజీవించెఁ
బుద్ధివలన మేలుఁ బొందకుండ॥

బట్టయే యెరుగడు కట్టనే యెరుగడు
నగ్నుడై చరియించె నాడు నరుడు;
అన్నమే యెరుగడు దున్నుటే యెరుగడు
కలిగినదే తిని గడిపెనరుడు;
వాసమే యెరుగడు గ్రాసమేయెరుగడు
చెట్లపైనే నిద్రఁ జెందెనరుడు;
చదువుల నెరుగడు పదవుల నెరుగడు
అడవులయందుండె నపుడునరుడు

గుహలలో మృగములట్టుల కునుక నేర్చె
ఎండవానల రక్షణ మెరుఁగలేక
నాత్మరక్షణకొరకునై యాయుధంబు
నెరుగకను పారిపోవుటే యెరిగెనాడు॥

ఎఱుగడు జీవితలక్ష్యము
నెరుగడు సుఖజీవనంబు నెరుగడు మాయన్

ఎరుగఁడొక యాశఁజిక్కుట
నెరుగును తిండికినిమాత్ర మిటునటుతిరుగన్॥

నాస్తికుటుంబజీవనము నాస్తి సమాజపు జీవనార్థముల్
నాస్తి విలాసజీవనము నాస్తి జగత్ప్రతి భావనాగతుల్
నాస్తి విధానజీవనము నాస్తియె సుశాస్త్రకళాకలాపముల్
వాస్తవమేదియో తెలియు ప్రజ్ఞయు లేదలనాడు వానికిన్॥

వనచరముల జంపుటయో
వనములలో దొరకునట్టి ఫలములదినుటో
దినములు దొర్లించుటయే
యనుదినము సమస్యలయ్యె నతనికి నపుడున్॥

ఆకులలంబు సిగ్గునకు నడ్డముగానిడి జంతులట్లు తా
పోకడనేర్చె; నంతకును పూర్వపుజన్మల గల్గు వాసనా
లోకములోని యోచనల లోన పరిభ్రమణంబు సల్పియా
యాకలియే సమస్యగ విహారము జేసె నరణ్యభూములన్॥

పచ్చిమాంసంబునే భక్షించెనొకతరి
నగ్నిలాభంబునే యరయలేక
కందమూలాలనే కడుపారదినుచుండె
ననలోపయోగంబు నరయలేక;
ఆకులలంబులే హారంబుగావించె
పచనంబుజేయు సొం పరయలేక;
యేమేమొ గింజల నెల్లెట్లొ భక్షించె
వేపుడులోనున్న వేడ్కగనక;

అగ్నినే యెరుగనట్టిదా యబ్బురంపు
కాలమానాటి నరుడు కల్లోలమైన
జీవన విధానయాత్రలో చిక్కుపడుచు
దినదినంబును తనలోన దిగులుపడెను॥

గాలికి వానకు జడియుచు
కాలము నొకరీతి నెట్టు గలవరపడుచున్
మేలును కీడు నెరుంగక
జాలిపడుచు నరుడు బ్రతికె జగమంతటిలో॥

ఒక్కతరి చెట్లమీద మరొక్కతరిని
పర్వత గుహాంతరాల నివాసమయ్యె;
చీకటినిదాటు తెరుగడా, చిత్రమేమొ
అదియు నెరుగడు పసిబాలు నట్లు నరుడు॥

మాటల నెరుగడు మరియు
న్నాటలఁ బాటల నెరుంగ డసలే నరుడే
బాటలరీతి నెరుంగకఁ
జీటికి మాటికిని చింతజెందుఁచు బ్రతుకెన్॥

భయమే వాని ప్రధానభావముగుచున్ వాసంబులేకొండు, ని
ర్భయమా జీవనమే యెరుంగకను, తా భ్రాంతిన్నదాముగ్నుడై
నయమార్గంబు నెరుంగలేక నరుడా నాడెంతగా కుందెనో
దయకున్నాబ్రతముగాదె నేడుతలపన్ తత్వజ్ఞులా వారికిన్॥

చలికి వణకుచు నిప్పుసంగతి నెరుగడు
జలము గాంచవాని కులుకుగలుగు
పిడుగుపడిన యప్డు భీతిల్లి నిట్టూర్చు;
మెరపుగాంచునపుడు పరువులెత్తు॥

అందములు తోచవతనికి
చందములు తెలియబడవు సతతము భయమా
క్రందనమె గతియయ్యెను
అందనిఫలమయ్యె సర్వమప్పు డతనికిన్.

కొంతకాలమిటులఁ గొనసాగెనంతటఁ
బుద్ధిలోనిజడత పోయెఁగొంత;
మట్టితోడనిల్లు గట్టునెరింగెను,
కట్టెనారబట్టఁ గడకు నరుడు॥

క్రమత మృత్తికతో భాండకల్పనంబుఁ
జేసె; నదిగాంచితనలోన చిత్రమయ్యె.
నీటిఁదనయిచ్చవచ్చిన నెలవుఁజేర్పఁ
నరుడెరిగె వానికెంతయో కరవుదీరె

వనులు తగులఁబడిన భయపడి పరువెత్తు
నరుడు నిప్పుమేలు నరసిపిదప,
పక్వఖాద్యములను భక్షింపనేర్చెను;
బ్రతుకుబాటకొంత బాగుపడియె॥

జంతువులను జంపి జంతుచర్మంబుల
ధరియింపగా నేర్చె తనువునందు;
వాటితో సంచులఁ బాదాల చెప్పులఁ
దలమీఁదటోపీలు సలుపనేర్చె,
గోళ్ళను నగలుగాఁ గొమ్ముల నూఁదెడి
బూరలఁ జేయగా బుద్ధి నేర్చె;
నెముఁక లాయుధములై యింతయో, యంతయో
యాత్మరక్షణవృత్తి నతడు నేర్చె

గట్టిచర్మాలఁ డాలుగాఁ గట్టఁ నేర్చె;
విల్లునమ్ములఁ గూర్చెడి విధముఁ దెలిసె;
రాతితోఁ గత్తుల నొనర్చు రీతి నెరిగె;
తెలిసె సాంఘికజీవనఁ బలముఁ గొంత॥

నిప్పుననుంచి, భాండముల నేర్పుగఁ గట్టిగఁ గాల్చి, వానిలో నొప్పుగ వండు నేర్పెరిగె నూహావికాసముఁ బొంది యాపయి నున్నిప్పును, గారమున్గలిపి యోగిరమున్భుజియింపనేర్చెఁ, దా చప్పిడి జీవనంబునకు స్వస్తిని జెప్పెనరుండు, మీఁదటన్॥

అడవిమృగంబులన్గెలుచుఁ నాటగఁ విల్లును చేతబూని, యా యడవులలోన గ్రుమ్మరుఁ భయంబును వీడుచు స్వేచ్ఛతోడ; తా జడియడు వానకెండకు, విచారణఁ జేసెను రక్షకోసమై గొడుగును, పాదరక్షలును, కూర్చె నొకించుక బుద్ధితోడ్పడన్॥

అగ్ని చేయువిధము నాతడు నేర్చెను
కర్రలందు దాని క్రమముఁ దెలిసి,

ప్రత్తిఁ వత్తిఁ జేసి ప్రమిదలోనుంచి
వెలుగుఁగూర్చునట్టి విధముఁదెలిసె ॥

పెంపుడు జీవంబులలో
సొంపునుగు ర్తెరిగి వాని చొప్పుఁదెలియుచున్
యింపలరఁ వానిఁబెంచుచు
సంపదలకు తాపునాది సలిపెను తొలుతన్ ॥

గోబృందములఁబెంచిఁ గోమరారక్షీరముల్
మనసారఁ గ్రోలుటఁ మనుజుడెరిగె;
పాలనుగాచి యాఁపయిఁదోడుఁబెట్టుచు
పెరుగును సాధించుటెరిగె నరుడు;
పెరుగునుమథియించి పిదప నందునజిక్కు-
నవనీతసాధన నరుడునేర్చె;
దానిఁ నేతిగఁగాచి తగుమాత్రముగ భక్ష్య
ములనుంచి మెసవెనప్పుడు నరుండు;

గోమయముఁ బిడకలుగఁజేసిఁ గొనగనేర్చె;
మొదటివ్యవసాయమానాడుఁ కుదుటఁబడియె;
నెద్దు యుపయోగమానాడె యెరుక కబ్బె;
నరుని జీవనమార్గపుఁ సరణిమారె॥

అశ్వమును వాహనముఁజేసి యందునిందు
వేగముగ పయనమొనరించు విధము తెలిసె;
గడుసుదనమింత బద్ధిలో గలుగుకతన,
కాళ్ళశ్రమనుండి దాటగా గలిగెనరుడు॥

గుఱ్ఱము స్వారికబ్బె మరి కొంచెము యోచనఁ జేసిచూచి యీ
గొఱ్ఱెలఁ, మేకలన్మరియుఁ గోళ్ళనుబెంచెను పొట్టకోసమై
బఱ్ఱెలఁబెంచెఁ బాలకయి; బాపురె! మానవు నూహాపోహలన్
కుఱ్ఱతనంబుపోయి, సమకూరెను సౌఖ్యమునొందుమార్గముల్

సమమైనయట్టి విశాల మైదానాలఁ
బంటపొలాలుగా బాగుచేసి,
దున్నలెద్దులతోడ దున్ని భూమిని వాన
సాయానపండించు సస్యములను;
పిల్లలు నాలియుఁ బెంపార నొకచోట
వసియింతు రాకలి బాధలేక;
కమ్మనియన్నముఁ ఘుమ్మనుకూరలుఁ
భాండాల వండి సాపడుచునుండ్రు;

కఱ్ఱ లాకులతో యిళ్ళు కట్టుకొనుచు,
గాలి, వానల, కెండకుఁ గలతఁబడకఁ;
శాంతిసౌఖ్యాలరీతుల చవులఁదెలసి
నరుడు జీవన సౌభాగ్య నాణ్యమెరిగె ॥

అంత లోహయుగంబున నతడు చేరె;
నినుము యుపయోగమెంతయో గనెను నరుడు;
కత్తులు, కటార్లు, గొడ్డళ్ళుఁ గాలములును,
పుట్టె నానాటి నరునకు బుద్ధిలోన ॥

నాగళ్ళకిడె కర్రు నాణ్యంబుగా భూమి
దున్నఁ నీనాడది దొసగులేక;
ఛేదించుకత్తి యీ చెట్లను కలపకై
రంపంబు కోయును రాణతోడ;
బాడిత చెక్కను బహువింతగాదాని
కోరిన రూపంబు నేరుపరుపఁ
ఉలిరంధ్రములగూర్చి యొప్పార నతుకులఁ
బెట్టుదారువున కభీష్టమొదవ;
బళ్ళుఁ,రథములు, నరుని జీవనములోన;
వెలసె, దొలిసారి యాతని కొలువులోన;
ప్రత్తి యుపయోగమానాడు పట్టుబడియె;
చలిని గెలిపించి నరుప్రజ్ఞ వరలె జగతి;

శిలలనుజెక్కి గేహములు జిత్రముగాగ నభేద్యమానటుల్
సలుపగనేర్చెసున్నమును సాయముబొందుచుఁనేర్పుజూపి,యా
తలపులలోన సత్కళలు, తళ్కునఁ గాంతులుగూర్చి వానిచే
తలకొక యందచందమున తన్మయ వాస్తువిధానపూర్ణమై ॥

చెకుముకిరాయి సాయమునఁ జేసెదుఁ నగ్నిని ; విత్తనాలలో
ప్రకటితమైన తైలమును బాగుగగూర్చి నివాసమందునన్
వికటపు నంధకారమున విజ్ఞతదీపముఁబెట్టి కాంతిలో
సకలముఁ గాంచగాగలిగె సాధనకొక్కయ సాధ్యముండునే

ఒకరికొక్కరుతోడ్పడి యొక్కచోటఁ
బల్లెలను గట్టుకొనిరి యప్పట్టునందు
సంఘ జీవన సౌభాగ్య సారమపుడు
నరులలో కొంత కొంతగా వరలఁదొడగె ॥

అఖిల లోహాలపాత్రల యటుల జేయు
తెలివి వికసించె, నరునిలో దినదినంబు
వెండి బంగారు నగలపై వేడ్కఁగలిగె
బట్టలకు రంగువేయగా భ్రమలుగలిగె ॥

భావణము చేయనేర్చెను
భాషలు వేర్వేరుచోట్ల బలుగతులయ్యెన్
వేషములు గూడవెలసెను
భూషణములుగూడ వెలసె భువనములోనన్ ॥

తోలుత చర్మాలు తొట్టెలు తోడుపడుచు
నదులదాటించె నరులను మతులువెలయ;
నంత నావలనిర్మించి నడిపినదుల
నింతలో దాటనేర్చినా డేమిఁజెప్ప॥

జలధులలో ప్రయాణమును సల్పగనేర్చెను భీతిలేక నే
జలములపైన దారువుల చాలగ గోరినచోట జేర్పగా
కలిగెను; విజ్ఞుడైనరుడు కాలుకదల్పక నీటిమీదనే
యలరి ప్రయాణమున్సలుపు నందున నిందున నడ్డుగల్గకన్॥

కాలపురీతిలో నరుల గల్గిన బుద్ధివికాసమందుచున్
శీలముకూడ మారొ్పదవె; స్త్రీనొక బానిసజేసి యామెకున్

కాలికినోటికిన్ సరి యఖండపుబుద్ధికి మూతబెట్టి యా
కాలపు మానవుండు తనకమ్మని స్వార్థమునూహ చేసిడిన్.

బలమేన్యాయంబప్పుడు
బలవంతుడె పెద్ద యగుచు ప్రజల నదుపుగా
బలవంతునిచ్ఛయే దు
ర్బలులకు శాసనమునాడు బ్రతుకులకొరకై.

తనసౌఖ్యమునుగోరి జనులను బాధించు
నడ్డువచ్చినవారి నపుడె చంపె
తనసౌఖ్యమునుగోరి తనతోడి మనుజుల
పశువులమాడ్కి చేపట్టినడిపె
తనసౌఖ్యమును గోరి దారుణచర్యల
నడ్డెందు లేకనే యాచరించె
తనసౌఖ్యమునుగోరి తప్పున్నవారిని
మసిమసిగా జేసి మాడ్చివైచె

అపుడు బలశాలియా నరు డవనిలోన
నేను ప్రభుడనటంచనె వానికొఱకె
తక్కుజీవాళియని జెప్పె ధర్మమొకటి
దాని మీరిన శిక్షించె దాను ప్రజల॥

ధర్మము, దేవుడు, సత్యము
మర్మములు హుళక్కి వాని మతమందుననే
కర్మంబు తనకు సుఖమిడు
ధర్మంబది మీరు నరుల తనువులగూల్చెన్॥

అప్పటి యాదిమానవుల యట్టివిధానము వారలెట్టులన్
చెప్పిన శాసనంబదియె చింతలు చీకులు లేని సౌఖ్యమే
యప్పటి వాని గమ్యము దయాలవమే మదిలేని యా
చొప్పు సహింపజాలకవి శుద్ధులు కొంద రరణ్యభూములన్

తప మొనరించిరి శాంతికి
తపమున నావిర్భవించె తత్వము దానన్
ఉపకార మొదవె జగతికి
నిపుణత వేదంబులెల్ల నిర్మింపబడెన్॥

వేదముల సారమెల్లను విపులగతిని
నరుడు నారాయణునిబోధ నంది తెలసె
అదియె గీతయై జగతిలో నలరునేడు
సకల నిగమార్థ దీప్తియై సత్యమగుచు॥

నేరుపు మీర నావలన నిర్మితమయ్యెను నాల్గుజాతులా
తీరు గుణాలు కర్మముల తీరునుబట్టియెయుండు నందునన్
చేరక నేను వేరగుదు; జీవులు వర్ణవిభేదమొంద నొ
ప్పారుచునున్నతోన్నత విభాగము జేయుచు వానిదాటినన్
జేరుదురంచు శౌరి మునుజెప్పెను గీతను బోధసేయుచున్॥

తనువె సర్వంబుగా దలచి సౌఖ్యానికై
పరితపించును శూద్రవర్ణ మెపుడు
ధనమె సర్వంబుగా దలచి ద్రవ్యార్థమై
పరితపించును వైశ్య వర్ణ మెపుడు

మానమే ఘనమని మదినెంచి కీర్తికై
వాంఛించు క్షత్రియ వర్ణమెపుడు
జ్ఞానమే ఘనమంచుబూని తత్త్వాప్తికై
వాంఛించు బ్రాహ్మణ వర్ణమెపుడు ॥

తనువుకన్నను ధనమును దానికన్న
మానమును దానికన్నను జ్ఞానధనము
ఘనము; నరుని వికాసముగల్గు నిట్లు
నాలుగు వర్ణాల క్రమమగు నడకలోన ॥

అరయమూడుగుణాలను యంతరువుల
వెలయునీ నాల్గువర్ణముల్ వింతగాను
నరులు మొదట తామసపు టంతరువునందు
వర్ణ పద్ధతికాది నేర్పరచినారు ॥

తనుసుఖమునకై బాలునిరీతి జీవించు
యల శూద్రకులజుడే యాదినరుడు
బాహ్యప్రకృతిగెల్వ వస్తువర్గముఁగూర్చు
నాతడే భువిని వైశ్యాన్వయుండు
తనుబలంబున నన్యజనుల బానిసలట్లు
సలిపిన యాతడే క్షత్రియుండు
అతనియెదురులేని అధికారమోర్వని
యల తపోధనులె బ్రాహ్మణులునాడు

అల తమోకాలమున నాల్గు కులములిటుల
తను ప్రధానముగానొప్పి దనరె నపుడు
అదియె శూద్రయుగంబగు నవనిలోన
అదె పునాదిగ నరుడొప్పె నాదిలోన ॥

నాల్గుకులములిట్లు నాందిగానల తమో
గుణములోన వాటి గుర్తులిడియె
వైశ్యయుగములోన వరరజోగుణములో
నెట్లువృద్ధిపొందె నిపుడు తెలియు.



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# నర - నారాయణ చరితము



## తృతీయ సోపానము

### (విజ్ఞాన వికాస పరిణామము)

నర దేహమందు నాత్మగ
వరలుచు కాలంపు కర్మగతుల క్రమములో
పరమై యానందమై
స్థిరమగు నారాయణునకు చేతులు మోడ్తున్ ॥

ఒక్కొక జట్టు ముందునకు నొప్పగ బోవుచు మానవత్వమున్
చక్కగ సాధనన్నలిపి సంతతమాపద ప్రాప్తసూత్రముల్
తక్కినదారికై తెలుపు తథ్యములే ఘనశాస్త్రరూపమై
మిక్కిలి సాయమున్నలుపు మీదికిచేరని మానవాళికిన్ ॥

పోవువారుముందు పోవుచునుండగ
వెనుక నొక్కజట్టు వెడలుచుండు
ఆదివారికన్న నటు మీదవచ్చెడి
నరుల సంఘములకు గురుతులబ్బు ॥

అనుభవశాలురొసంగిన
ఘనశాస్త్రముసాయపడుచు గమ్యముజేరన్
జనులకు సాయముసలుపును
అనుభవమున గల్గు సత్యమాత్మమె దెలుపున్ ॥

పంటల వంటల నెరుగుచు
నింటిని పదిలంబుగాగ నేర్పరచి నయా
దంటయగు నరుడు ధనమును
పంటల పండించు నెరిగె వ్యాపారమునన్ ॥

ఇచట పండినపంట లింకొక్కచోటికి
జేర్చి యమ్మించుట నేర్చెనరుడు
ఇచట లభింపని యెల్లవస్తువులను
తెచ్చియమ్మించుట తెలిసెనరుడు
పట్టుతో నున్నితో బహువిధవస్త్రముల్
నేయించి యమ్మింప నేర్చెనరుడు
బహుళలోహాలతో పనిముట్లు చేయించి
అన్నితావులలోన నమ్మనేర్చె

ఇంటి కనువైనసామగ్రి ఇనుముకర్ర
కంచు నిత్తడి మొదలగు ఖనిజములను
గూర్చి చేయించి యమ్మించు కొట్లబెట్టి
సంత లానాడు జగతిలో వింతలయ్యె ॥

అపుడెవృత్తులు జగతిలో నవతరించె
కులము లానాడె యెన్నియో కలిగెనిచట
వస్తుమార్పిడి నాటిప్రశస్తరీతి
మనుజులందున వ్యాపార మార్గమందు ॥

నాటి ప్రమాణద్రవ్యమగు నట్టి సువర్ణము మానవాళికిన్
నాటికి నిప్రమాణముగ నౌటతలంపగ వింతయౌను యే

నాటికి స్వర్ణ మూల్యమను నాణ్యము లోకమునందుమారునా
నాటి నరుండు దుఃఖముల నాశనమొందగ జేయుదేవుడై

స్వర్ణకారులును కంచర్లు కమ్మర్లును
వడ్రంగులును సాలివారు చర్మ
కారులు మేదర్లు గానుగవారును
దూదేకువారును తోటవారు
రజకులు, మంగళ్లు, రంగువేసెడివారు
కుమ్మర్లు మరియును కూలిప్రజలు
ఆదిగా వృత్తికొకజాతి యమరెనపుడు
బలముగలవాడు వారికి ప్రభువయ్యె
జ్ఞానము వికాసమందిన ఘనుడునాడు
రాజగురువును మంత్రియై రాణదనరె ॥

కొంతమంది ప్రజలకూర్చి వారలనేలు
ఘనతపొంది తాను దనిసెనరుడు
అందునతని గొల్చు నాచారధర్మముల్
శాసనంబులనుచు చాటినాడు.

నగరముల గట్టనేర్చెను
పగతురఁ జండాడనేర్చె ప్రజ్ఞానిధియై
తగవులుదీర్చుట నేర్చెను
తగవరియై వెలయనేర్చె తనప్రజయందున్.

వనులనుగూల్చి క్షేత్రముగ వాటినిజేసెను; కొండలందునన్
ఘనతర దుర్గముల్ నెలపె కాంతుల గుల్కెడి రత్నరాశితో

తన నిజదేహగేహతతిదన్పె నృపాలకుడొచు సేనలన్
జనములజేర్చి యుద్ధములు సల్పగనేర్పెను వారికంతటన్.

జలధులనడిచెడి యోడలు
ఇలపై జననశ్వములును నింపౌరథముల్
తులలేని యాయుధములును
చెలువారనమర్పజేసె శ్రీమంతుండై.

తనదు క్షేమంబుకొఱకు ప్రార్థనలు సల్ప
పల్లెపల్లెను గుడులను పాదుకొలిపె
ప్రజలలో రాజుపై భక్తి ప్రబలునట్టి
సాధనము లెన్నియెన్నియో సంతరించె.

నరపతుల దనియ జేయగ
వరరత్నచయంబు; మరియు బంగారంబున్
తురగములు కరులు నొంటెలు
సరిలేని యమూల్యవస్త్రచయముల గొనుచున్॥

వణిజులొక్కొక్క దేశము వదలి యితర
రాజ్యములఁజేరి యింపైన రమ్యవస్తు
చయముకానుకలర్పించి భయముదీరి
నరపతుల మన్ననలగాంచి వరలిరపుడు ॥

ఒకదేశమందున నుత్పన్నమైనట్టి
వొకచోట భాసిల్లి యొప్పుచుండె
ఒకచోటపనితనం బొకచోటవర్ధిల్లి
పనివానికుత్సాహ పటిమగూర్చె

ఒక దేశమున లేని యొక్కొక వస్తువిం
కొకచోట ప్రజలలో నూహింపఁజె
ఒక రాజ్యమున లేని యొక్క యాచారమిం
కొక నప్రజకట నేగ నూదుకొల్ప

వణిజులొక్కొక్క సంఘమై వచ్చిపోవు
రీతిలో నరువిజ్ఞాన నీతిఁ బెరిగె
వృత్తు లొనరించు నరుల సంపత్తుఁ బెరిగె
నరుని జీవనసరణియు బెరిగె గొంత॥

తమయూహలు వ్రాతలుగా
క్రమత లిపులఁగూర్చి నరులు గ్రంథములట్లున్
రమణీయ శిల్పములలో
నమరించిరి ముందుతరము లబ్బురపడగన్॥

సలలిత సత్ప్రకాశమయి సంతత తాండవ నృత్యఖేలనా
విలసిత సుందరాకృతి యభేద్య విలాసిని శారదాంబ శ్రీ
కలిత కళాస్వరూపమున గానగనయ్యె మనోహరాంగియై
ఇలగల నాటిమానవుల కింపులు గూర్చుచు చిత్తసీమలన్॥

నరుడెంత మూర్ఖుడైనను
పరుడై యొక ప్రభువుగలడు పాలకుడౌనీ
ధర జీవుల కనుసత్యము
స్థిరమైకన్పట్టు వారి చిత్తములందున్॥

ఆ పరమేశునామముల నంతములయ్యె జగంబునందు నా
దీపిత సత్ప్రతాపునకు దేవళముల్మరి వానిలోన నా

శ్రీపతి రూపకల్పనము చేసిరి మానవులెన్నొ రీతులన్
ప్రాపిత సత్కళాకవిత భవ్యమనోహర సుందరాకృతుల్॥

అఖిల లోకాధిపుడైన నారాయణు
డొకచోట శక్తిగా నొప్పి వెలసె
ఒకచోట లింగమై యొప్పారభాసిల్లె
నొకచోట రూపమే యుండనట్టి
యాలయపరిమితి నంది పూజలగాంచె
నొకచోట చెట్టయి యుండెప్రభువు
ఒకచోట గ్రంథమై యున్నతోన్నతభక్తి
భావార్చనంబుల బడయుచుండె
ఒక్కయెడ ధేనువై మరియొక్కచోట

ఒక యెడను దారువై పూజ లొందజొచ్చె
సలిలరూపంబు గనె నొక్క స్థానమందు॥

శారద సత్కళామయి యసామ్యప్రకాశిని యెన్నొరూపులై
ధారుణిలోన భాసిలె; సుధాకర భావ ప్రపూర్ణ దేహియై
చారుతరార్థసంకలిత శాస్త్రవినోదిని శబ్దరూప వి
స్తారతగాంచె మానవుని సన్మతినాటికి నాడు దివ్యమై॥

కీర్తించునొక్కడు యార్తపాలనదక్ష
కవితాస్రవంతుల గరిమ వెలయ
చిత్రించునొక్కడు చిత్రవిలాసుని
బహు చిత్రవర్ణ సత్ప్రభలుగులుక

నిర్మించునొక్కఁడు నిత్యునసంతుని
శిలలందు సౌందర్య శ్రీలువెలయ
నర్తించునొక్కఁడు నామరూపానంతు
తాండవనృత్యాన దనియునట్లు

ఒకడు నటియించుతత్ప్రతి నూహానిలిపి
ఒకడు వినిపించు పరమేశు ప్రకటితాత్మ
లసిత గుణజాల శుభద విలాసములను
నరుని కబ్బెను హరిజేరు తెరవునాడు ॥

ఆకసమంటుపర్వతము లగ్రము లందున యాలయంబులన్
శ్రీకర శిల్పచాతురి విశేషవిధానములందుగూర్చి శో
భాకర పూర్ణసుందర విభాసిత సత్కృతి నందుబాటుగా
జేకొని నిల్పిరార్యులు వశీకృతధీనిపుణార్థసంపదన్ ॥

వారువములేస్గులను తన వాహానముగ
జేకొనెనరుడు తనలోని చేవఁదెలిసి
వాహానములైరితనతోడి వారుకూడ
నరుని నధికారవాంఛలు పెరుగదొడగె ॥

పశుబలముజూపి తక్కిన ప్రజలు తనకు
దాసులుగనేలు ప్రజ్ఞతో దనరినాడు
నాడునరులోని తృష్ణయు నవ్యపల్ల
వాంకురితముగా శోభిల్లె నతిశయించి ॥

తన యేలుబడిలోని ధరణిసర్వంబును
తనసొత్తెయనినమ్మె జనుడునాడు

తనకు దాసోహమం చను వారలెల్లరు
తనదాసులనినమ్మె జనుడునాడు
తనయాజ్ఞ నరులకు దైవాజ్ఞయేయని
నమ్మెలోకులనేలె నరుడునాడు
దాసులధర్మంబు తనుగొల్చుటేయని
నమ్మికతోనుండె నరుడునాడు

వానివైభవంబు వానిప్రాభవమును
వానిగౌరవంబు వరలు కొరకు
కోట్లకొలది ప్రజలు గోల్పోవ నుసురులు
చింతఁబడడువాడు ఎంతవింత! ॥

ఆత్మజ్యోతి గప్పి యుతనిలోస్వార్థము
ఎదుగుచుండెహద్దు లేమిలేక
రాజభక్తియనెడి రమ్యమౌ తెరవేసి
ఆటలాడువారి కపుడెమొదలు ॥

తనుబలముగల్గువానిని
తనబలముగ జేసికొనుచు ధనమును ఘనతన్
కొని ప్రజలనణచు నేర్చును
మనుజునిలో వెలసెబుద్ధి మాంద్యముపోమెన్॥

ఒక్కయెడనాత్మయును మరి యొక్కవైపు
అహముగూడను వర్థిల్లె నతిశయముగ
పంటచేలలో కలుపును పైరుకూడ
సమముగా పెర్గుచున్నట్టి చాడ్పుఁదోచె॥

నరుడొకడు పల్లకీనెక్కి గరువమొంద
పదుగురును వానిపశులట్లు పట్టిమోయు
బానిసతనంబుగూడను ప్రబలజొచ్చె
మానవులనాటి ప్రకృతి క్రమంబులోన॥

ఆవులు నశ్వము ల్గజము లర్థము కోళ్ళు పొటేళ్ళు నొంటెలున్
వేవిధమైనవస్తువులు వింతలుగూర్చెడి రత్నరాసులున్
కేవలమల్లనాకమును క్రిందొనరించెడి వస్త్రభూషలున్
భూవిభుసొత్తుగా వెలసె భూరిపదాంకిత సాంప్రదాయమై॥

మానము విజ్ఞానంబును
మానిత సంపదలు వెలయు మార్గములోనన్
మానవస్థ[illegible] బోధకునడచెను
జ్ఞానము చిగురాకుదొడగె జనులందపుడున్॥

దేవుని గూర్చిన దివ్యమౌరచనల
సాగించిరానాటి శాంతమతులు
దైవసందేశంబు తామాలకించుచు
వసుధ బోధింత్రు ప్రవక్తలపుడు
మునులు వ్రాసిన వేదముల కర్థములు చెప్పి
భాషింత్రు సభలలో పండితాళి
ప్రార్థనా మహిమంబు ప్రజలకు విన్పించి
భగవంతు నర్చింత్రు భక్తులపుడు
నాడుయుద్ధములందున నోడిపోయి
పరులదాసులై బ్రతికెడి బానిసలకు

శాంతిసౌఖ్యాలు దూరమైపోయె మనకు
దైవమె శరణ్యమాయెను ధరను తమకు॥

ఆతరి మతముల జన్మము
భూతలమున గల్గె జనుల పుణ్యమొ యెటులా
రీతి నాకృతి గొనుచున్
చేతములో వారికెల్ల చీకులు వదలన్॥

విజ్ఞానులోకవంక విను వీధి మార్గాల
తమతపశ్శక్తిచే తరచి చూచి
గ్రహగతుల్ నక్షత్రగతులు రాసులరీతి
శాస్త్రసిద్ధాంతముల్ వ్రాసినారు
గ్రహణాలరీతులు కాలవిజ్ఞానము
శాస్త్రసిద్ధాంతముల్ వ్రాసినారు
దేహవిజ్ఞానంబు దేహివిజ్ఞానము
శాస్త్రసిద్ధాంతముల్ వ్రాసినారు
తత్వవిస్తరణంబు దనరు నాయుర్వేద
శాస్త్రసిద్ధాంతముల్ వ్రాసినారు

శాస్త్రములు, శాస్త్రులును రాజసభలలోన
పోషణము గౌరవముగాంచు భూరిసత్వ
భాసితంబైన క్షత్రియ భవ్యయుగపు
నాది వైశ్యయుగాంతపుటాదియయ్యె.

ధనమే లెనాడు ప్రజలను
ధన సేకరణాదులే ప్రధానంబయ్యెన్

జనబలము శాస్త్రబలమును
ధనవశమున నిలిచిపెరిగె ధరణినెల్లెడన్.

కాని యదేమిచిత్రమొ యొకానొకనాడును సత్కళాత్ముఁడై
మానిసి స్వేచ్ఛతో బ్రతుకుమార్గము వీడక నాత్మతృప్తితోఁ
పూనిక సత్యగమ్యమగు పూర్ణమువైపున కౌనుగాని యా
జ్ఞానముబద్ధుఁడై కొనఁడు కాంచనబద్ధత సత్యమున్మఁచున్.

అతనిలో కిరణదీప్తుల యరలుమెండు
అతనిలో సచ్చిదానంద మనవరతము
నిర్మలతరంగభాసమై నిలచియుండు
ప్రకృతి యధికారమున కది పట్టుబడదు.

రాజ్యవ్యవస్థలో రాజు ప్రబలుడౌచు
శాసనాతీతుడై స్వామియయ్యె
బుద్ధివికాసముపొంది వ్యవసాప
నాచార్యుడేమంత్రి యగుచునుండె
విక్రమశాలియౌ వీరాధివీరుడే
సేనాధిపతిగాగ చెలగుచుండె
ధనమునాకర్షించు ఘనప్రజ్ఞ గలవాడె
కోశాధిపతియౌచు కొమరుగాంచె

పాలనారీతి మరికొంత పల్లవించె
సాంప్రదాయాల పేరుతో శాసనములు
నరుల శిరములపై కొంత పెరుగదొడగె
ఆజలను మీర శిక్షలు అమరియుండె॥

నాఁడు రాజ్యవ్యవస్థకు నాణెములును
వెలసె వేర్వేరు చిహ్నాలు కలిగియపుడు
ఒక్క రాజ్యాని కొకచిహ్న మొక్కదాని
కరయ వేరొండు చిహ్నము లమరియొప్పె॥

జాతులు, నుపజాతులుగా
నాతరి ప్రజలందుశాఖ లలవడె క్రమతన్
జాతికి జాతికి నడుమను
భూతలమున వైరమబ్బె పోరులు కలిగెన్॥

వసుధఖండములుగా వరలెను తత్ఖండ
గతములై దేశాలు కలిగె కొన్ని
తద్దేశ గతమయి తనరెను రాష్ట్రముల్
తద్రాష్ట్రగతమయి దనరె మండ
లాలు; నందున సీమలమరె తద్గతమయి
జనపదావళియును దనరె మిగుల

వానికెల్లను పేర్గబ్బె వానికెల్ల
బాలనా క్రమమందున ప్రభువులమరి
రందఱును దేశపాలక సంఘములుగ
నొప్పి పాలించుచుండిరి యుర్వినెల్ల॥

ఆతరి విజ్ఞతాపటిమ నందిన జ్ఞానులు భూమినంతటన్
నీతిని నిర్ణయించుచు ననేక సుధర్మ ప్రపూర్ణ గ్రంథముల్
పూతగుణాఢ్యులై రచనమున్ పొనరించిరి సంఘశ్రేయముల్
చేతములో దలంచుచు విశిష్ట విధాన ప్రధానసూత్రముల్॥

అట్లు వారలు రచియించినట్టి ధర్మ
గ్రంథములు నృపుల శాసనా కలితవృత్తి
సంఘములదీర్చి చక్కగా సంఘటించె
మతములును దానితోడనే యతుకుబడియె ॥

వృత్తులు, రాజిల్లెను సం
పత్తులు, ధర్మములు మరియు భగవంతుని స
ద్వృత్తము వికాసమున్గనె
నత్తరి రాజసగుణాబ్ధి నలలు వెలయుచున్ ॥

రాజసభావపూరిత విరాజితమూధరనాడు వర్ణముల్
తేజముగాంచి వృద్ధిగనె దీనతవీడి నరుండు నిత్య వి
భ్రాజితదేహ చిత్తముల రాజిలు నాత్మవికాసమూని య
రాజులు మానవావళిని రాజిలుశక్తికి గుర్తులౌటచే ॥

అల రజోకాలమున నాల్గు కులములిటుల
ధనప్రధానముగానొప్పి దనరెమిగుల
అదియె వైశ్యయుగంబగు నవనిలోన
నదియెకుడ్యమై నరుడొప్పె నంతమీద ॥

నాల్గుకులములిట్లు నాందిగానలరజో
గుణములోన తమదు గుర్తులిడిరి
క్షత్రియయుగమందు సత్వగుణంబులో
నెట్లు వృద్ధిపొందె నింక తెలియు ॥



శ్రీరస్తు　　　శుభమస్తు　　　అవిఘ్నమస్తు

# నర - నారాయణ చరితము



## చతుర్థ సోపానము



(కళా వికాస పరిణామము)

వరగుణుడై యాకాలపు
నరులందున జన్మమందు నారాయణుడా
తెరగే యవతారంబా
పరమాత్ముని నాత్మదలచి ప్రస్తుతి జేతున్ ॥

గాలికి నీటికి భయపడు
కాలము చనె నరుడు నేడు గణియింపక నా
గాలిని నీటిని బంటుల
పోలిక తానేలువాని బుద్ధిదనర్పన్ ॥

కాలమున గుణములమరుచు కదలుముందు
నరుని యాత్మవికాసము పెరుగుకొంత
ఎంతపెరిగిన తనలోన నంతశాంతి
గాంచుతామించు భూతాలవంచియతడు ॥

అంతవరకు బయటి అస్త్రాల దనిసిన
మనుజుడిపుడు మరలె మనసువైపు
దాని చిత్రగతులఁ బూనికగాంచగా
నోర్పుతోడ నప్పు డుద్యమించె ॥

కనియెడి సృష్టిపాతబడి కాల్పనికార్థ ప్రపూర్ణమైన యా
మనసున నంతరాళములు మాపులు రేపులు మారినాత్మమై
ఎనయుచు దోపమానవు డోకించుక తృప్తినిగాంచలేక తా
పనిగొని తర్కగమ్యమగు బాటలదీర్చుచు పోయెముందుకున్.

కథలు పురాణముల్ ఘనకావ్యవర్గంబు
లతని మానసవీథి నవతరించె
నర్తనశాస్త్రముల్ నాట్యశాస్త్రంబులు
నతనిమానసవీథి నవతరించె
ఘనప్రబంధావళియును నాటకంబులు
నతనిమానసవీథి నవతరించె
సంగీతశాస్త్రము సాముద్రికంబును
అతనిమానసవీథి నవతరించె

శబ్దశాస్త్రముల్ చంధస్సు సరసలలిత
మగునలంకారశాస్త్రము మరియువాస్తు
వాదిగానెన్నొ యోచింప నంతులేక
నరుని మానసవీథిలో నాట్యమాడె.

భాషలసంస్కరణంబును
భూషలసంస్కరణదీక్ష పొడమె నరునిలో
వేషములతీరు పెరిగెను
భేషజము న్బెరిగిపోయె బిరుదులు పెరిగెన్.

కులపతుల్ వెలసిరి గురువులు వెలసిరి
ధర్మశాస్త్రిమతాల దనరజేయ

ఆలయంబులలోన నమరె సత్కళలెన్నొ
సాకారదైవంపు సరణిఁదెలుప
విశ్వవిద్యాలయా ల్విపులంబులాయెను
విజ్ఞానబోధలు వెలయజేయ
నక్షత్రశాలలు నాల్గుమూలలనొప్పె
గ్రహచారనక్షత్ర గతులుదెలుప

ఖనిజ పరిశోధనంబుల గతియువెలసె
పాకశాస్త్రములోగూడ ప్రభలుగులికె
సమర శిక్షణారీతుల సరణిహెచ్చె
నాలుగువిధాలఁ బెరిగెను నరుడునాడు.

కాలమునుగొల్చు సాధనాల్ చాలగలిగె
కాలయాపనావిధములు గలిగెచాల
కాలచక్రపుగతియును గనెనునరుడు
కాలమహిమంబు లికవాని గడువలేవు.

కొలుచుచు, తూచుచు, లెక్కలు
నిలిపెను మానవుడు కొన్ని నియమములందున్
ఇలగల్గు వానినెల్లన్
కలిగెను పరిమాణమెల్ల కార్యములందున్॥

ఆతరిగేస్తు జీవనము నందున సంస్కరణంబు హెచ్చె; నా
రీతిని దంబజీవనపు రీతియు జేరెను; నేడువానిలో
నీతి ముసుంగుమాత్ర; మవినీతియె చెల్లుచునుండె సంఘపుం
నీతిగ; యాత్మదూషితమనిర్మలవృత్తి వికాసమందెడిన్॥

తనకై తనవారలకై
తనవారల వారికొఱకు తనివితీరు భూ
ధన, గోధన, స్త్రీధన, సా
ధనయే సర్వంబటంచు తలచె ననిశమున్॥

స్వార్థము యేపుగా బెరిగె వైభవ సంపద లందుకోసమై
స్వార్థులమాయక ప్రజల పాలకులై పయివారిదాసులై
వ్యర్థపు జీవనంబున నపార్థము గూర్చిరి రాజభక్తికిన్
వ్యర్థపు దేశభక్తికి కృపారహితాత్మ మతాలవ్యాప్తికిన్॥

అలనారాయణ దర్శనంబునకునై యాది న్మతాలుపుట్టె న
వ్వల స్వార్థంబున కయ్యెనయ్యవి మహాహింసాత్మకంబౌచు కే
వలమున్ చంపుటకయ్యె సోదరతతిన్ పాపంబుగా నెంచకన్
చలమున్బూనియెదుర్చు వారికవి హింసారూపిరాజయ్యెడన్॥

వాని మతముకొఱకు వందలువేలును
లక్షలైన యుద్ధ రంగమందు
నసువు లిడువవలయు నవియేమిమతములో
మనుజరక్తమందు మచ్చపడియె॥

వనితలుగూడ రాజ్యమును పాలనజేయ గలారటంచు భూ
జనములు శాసనంబునకు చాలగనమ్రములటంచు నెల్లరున్
కనిరికపుస్తకంబులను గల్గెడి సూత్రములందు బద్ధులౌ
జనములుగూడ విశ్వమున జాలగ వృద్ధినిగాంచి రత్తరిన్॥

నాడొక శాంతమూర్తియగు నవ్యకృపారసపూర్ణ బుద్ధుడౌ
వాడుమహాత్ముడై వెలయు వాడుజనించి వచించె తృష్ణయే

పాడొనరించు నేడవని ప్రస్తుతిశాంతిని దానివీడు నె
వ్వాడతడే గనుంగొను నపార శుభంబును మానవాళికిన్॥

జన్మముల పేర పశువుల నెన్నొ జంపి
బలియనెడి పేర పూజలు బరగెనపుడు
మనుజులకు శాంతికై బుట్టు మాయమతము
బలులరూపముగాపిట్ట తలలువైచె॥

బుద్ధునిబోధలాయుగపు పూర్ణసుబోధలుగాగనయ్యె దు
ర్బుద్ధులుపోయె సంఘమున పుణ్యపథంబానగూడె హింసకున్
బద్ధులుకాక యాపయి విభాసితులైరి జనాళియింతకున్
శ్రద్ధకు రూపుమారెను ప్రశాంతపు సాత్వికమార్గ మబ్బెడిన్॥

నీతిమెరుంగకన్ బతుకు నీమములెల్లను మంటగల్పుచున్
ఘాతుకమార్గగాములను కెడని పశ్చిమమంబెడాంలా
నీతిపథావలంబుడగు నిశ్చలచిత్తు డొకండుపుట్టి యా
భూతలనాథు నాజ్ఞలను భూమిప్రజాళికి దెల్పె ప్రేముడిన్॥

అతనిమతము నేడు అవని నల్దిక్కుల
భక్తతతినిగూర్చె ప్రభువు పేర
విగ్రహంబులేని వింత దేవళములో
వారిభక్తినే డపారమె గద॥

దేవునిపుత్రుడైనయొక దివ్యుడు దేవునిరాజ్యస్థాపనా
భావముతోడ జీవనపుపద్ధతు లన్వయించి మీద తా
జీవనత్యాగియై వెలసె శిక్షకు బొల్పడి ప్రమానిపైన నా
దేవకుమారు బోధలను దెల్పును విశ్వమనేక భాషలన్.

క్షమియింపనేర్పుటే జనుని యౌన్నత్యమం
చా దివ్యబోధలో నాదిబోధ
తనకున్నదానిలో ననుకొంతభాగము
పేదకిమ్మని వానిపితృబోధ
తనకన్నచిన్నలౌ జనులసేవించుటే
ఘనమని తెల్పునాతనిసుబోధ
విశ్వాసమునకన్న వింతయౌఘనశక్తి
నాస్తియంచను వానినర్మబోధ

మాయ నెదిరించి శోధన మార్గమందు
ఆత్మబలమును జూపించు నతనిబోధ
ప్రభువువిశ్వాన భాసిల్లు పథముగూర్చ
జన్మసాఫల్యమనివాని ఘనపుబోధ॥

ఆ మహితాత్మబోధనము లంతకునంతకు పశ్చిమావనిన్
ప్రేమప్రసారమున్నలిపె పేదలసేవల జేయనేర్పె నీ
భూమిని గూడభక్తిమయపూర్ణము జేయగబూని దీన సం
క్షేమ విధానమార్గముల శ్రీలలరారగ గూర్చె సత్కృపన్ ॥

చుక్కలట్లుగ నందందు సుజనవరులు
విశ్వమంతట వెలసిరి విశ్వశాంతి
ఆత్మపథగమ్యమైనట్టి యమలమతులు
సాత్వికప్రధాన ధర్ములౌ శాంతిమతులు॥

ఇటువిజ్ఞానము కళలును
పటుతరవైభవముతోడ భాసిలజొచ్చెన్

కుటిలతయు మారె జగమున
నెటుజూచిన నాత్మవెలసె నింపై సొంపై

యంత్రయుగంబులో నడుగిడెకాలము
అబ్బురంబౌ శక్తు లరయనయ్యె
అగ్గిపెట్టెలు బట్టలమరించు యంత్రముల్
కాగితంబులు జేయగలుగు యంత్ర
ములు నీటి నున్నతంబును జేర్చు యంత్రముల్
రైలుబళ్లును కార్లు రాళ్ళద్రవ్వ
యంత్రాలు బియ్యపు యంత్రాలు చక్కెర
యంత్రాలు ముద్రణా యంత్రములును

విద్యుదుత్పాదనము జేయు వింత యంత్ర
మావిరిని బలముగ జేయునట్టి యంత్ర
మబ్బురముగూర్చు నిన్నిన్ని యనగరాని
యంత్రములు నరుని విజ్ఞత నవతరించె॥

నీటినిఁ దేలెడి యోడలు
వాటముగా గాలిలోన బారెడినోడల్
నీటను మునిగెడి నోడలు
నేటిజగములోన వెలసె నిస్తులమగుచున్॥

అగ్ని వేడినిగొల్చు నట్టి యంత్రంబులు
గ్రహములు గొలువగా గలుగు యంత్ర
ములు వాయుసాంద్రత గొలుచు యంత్రంబులు
నరుని వేడినిగొల్చునట్టి యంత్ర

ములు భూమిదున్నుచు బోవు యంత్రంబులు
పాలవెన్నను వేరుబరుచు యంత్ర
ములు వాయువునుగూర్చు విలసితయంత్రముల్
గాలినిపీల్చగా గల్గుయంత్ర

సముదయము జగమునంతట చాలగలిగె
నరుల దేహపరిశ్రమ తరిగె చాల
మతుల రంజించు మార్గాలు బొదలె మిగుల
ఆత్మతేజోమయంబుగా నలరదొడగె॥

రూపంబునకు ప్రతిరూపముల్ జేకూర్చు
వింతయంత్రంబులు వెలయుచుండె
నరుని రీతులనెల్ల తెరలపై జూపించు
వింతయంత్రంబులు వెలయుచుండె
ధ్వనులకు ప్రతిధ్వనులను గూర్చగల్గిన
వింతయంత్రంబులు వెలయదొడగె
ధ్వని విశ్వమున కోరుకొనుచోట జేర్చెడి
వింతయంత్రంబులు వెలయుచుండె

ఆటపాటలు రూపము లవని నాల్గు
చెరగులను నింపి నరులకు చిత్తసీమ
వెలయ నేర్పరులైనట్టి వింత యంత్ర
సముదయము భూమిలోనిండె క్రమముతోడ॥

పంచభూతాల లోపలి పసను దెలసి
పంచభూతాల నెల్లనువంచి తనకు

బంటులుగ నేలు ప్రజ్ఞ చేపట్టినరుడు
వెదక నేరడె భూతాధి పతిని ముందు॥

శాంతియ శాంతి యస్త్రముగ సంతతమున్నమరంబుజేయు నా
శాంతియొకప్డు గెల్చెడు నశాంతియుగెల్చెడు వానియుద్ధమే
వింతలగూర్చు నీజగతి వేడుకయబ్బెడిశాంతి గెల్వగా
వంతలశాంతికిజ్జయమువచ్చినకాలములోన భూమికిన్ ॥

అలరసాయన శాస్త్రపు టంతుదెలిసి
మందు కనిపెట్టి బంధూక మందుఁకూరి
సాటివారిని జముపీట సాగనంప
నేర్చెనది వృద్ధి పొందుచు నేడు పెరిగె ॥

నరుడు సర్వంబు తనయధీనమున నుంచ
గోరి మారణద్రవ్యాల గొన్ని జేయ
తనదు మస్తిష్కమంతయు ధారపోసె
తత్ఫలమె ప్రళయబాంబుగా దనరు నేడు

అది విశ్వైకబళనంబున
కదను కొలకుగాచియున్న దందందునన
య్యది కోరుకోర్కెదీరిన
తుదిక్షణమహా మానవునకు దొసగుల వలనన్ ॥

కానియశాంతిదేవతకుగాదు జయంబిక శాంతి దేవియే
బూనికవిశ్వమున్నడుపు బుద్ధినిగూర్చుచు మానవాళికిన్
మానవు దివ్యమాహృదయమార్గము రాజిలు విశ్వవీధిలో
జ్ఞానముదీపమై వెలయగల్గును విశ్వము మారుదివ్యమై

గగనసీమలోన గనుగొన్న చిత్రాల.
జేరగలుగు నట్టి చిత్రప్రజ్ఞ
నరుని కబ్బెనింక నారాయణుని జేరు
తెరవు లబ్బకున్నె? యరయుకోలది॥

వెలుగులు దోచునేడు ఘనవిజ్ఞులు శాంతిపథానుగాములై
విలసిలువారి చిత్తముల విశ్వమునందలి చిత్తివృత్తికిన్
చెలగెడు నాత్మకైక్యత విశేషవిధంబుల నబ్బుచున్న దా
వలజనకోట్లభావములు భాసిలునే కవిధానపూర్ణమై॥

రాజ్యములు వీరభోజ్యమనరాదిక రాజులు పోదురీపయిన్
త్యాజ్యముచేసి రాజ్యముల తామసవృత్తియడంగె, భూప్రజల్
రాజ్యమునేలు కాలమిది రమ్యసుశాసనబద్ధమానటుల్
పూజ్యతనెల్లచిత్తముల పోవునిరంకుశమింక మీదటన్॥

మాటలలోన త్యాగమును మాటునలాభముతాండవించు న
చ్చోటులుగల్గు గాని యవి చోద్యముగా క్రమవృత్తిమారు; నే
మాటలుచెప్పిరోయదియె మానసమై పనులై యదార్థమై
మాటలు కోటలన్నిటిని మాయముజేయును సత్యరూపమై॥

మతముల నైక్యతగల్గెడి
మతమునకై తపముజేయు మతులందున శ్రీ
పతి వెలసి యైక్యసూత్రము
నతికించును విశ్వజనుల మానసమందున్.

ఏకమనేకమై వెలసి యెన్నియొచిత్రము లిచ్చినట్టి య
స్తోక విలాసితంబగుచు శోభిలు జీవులయాత్మ యీపయిన్

ఏకమువైపు భాసిలు ననేకము నేకముఁజేసి నిత్య సు
శ్లోకపథావలంబన విశుద్ధతనీనరకోటి భాసిలన్॥

అహము మారుచునింక నాత్మగాభాసిల్లు
అహవాదులికమీద నాత్మవాదు
లబ్రంబుగాస్వార్థ మంతరించెడునింక
స్వార్థులు త్యాగులై వరలుచుంద్రు
విశ్వకుటుంబమై వెలయు నీధరయెల్ల
సోదరభావంబు సొంపుమీరు
సత్యజీవనమె విస్తారమై భాసిల్లు
కల్లమార్గములింక కానబడవు

అందుకుపునాదు లీనాడె యవతరించె
నరునిలో నోర్పునానాడు వరలజొచ్చె
నమ్మలేకుంట యొక్కటే నరునిలోటు
నేడు జగమందుసోదరు జాడదెలసి॥

ఒక్కొక్కచోటినుండి గన నొక్కొక్క రూపున దోచుసత్యమున్
చక్కగ బోధజేసిరి ప్రశస్తగుణాకరులైనవారలా
చక్కని సూత్రజాలములు సత్యములో నొకభాగమంచు నే
డొక్కడు రామకృష్ణుడయి యూహలమీరివచించెభూమికిన్॥

మతములపేరుతో నరుని మత్సరవృత్తి యనంతమౌచు దు
ర్మతియును నాస్తికుండగుచు మానవద్వేషము కల్గునాడు; స
ద్వ్రతుడు జగద్గురుండగుచు భాసిలు శంకరుడుద్భవించి యీ
మతముల కేకసూత్రమగు మార్గముజూపె సతనానంబుగా॥

అదె యద్వైతము; వేదగమ్యము; శుభం బధ్యాత్మిక జ్ఞాన సం
పదకున్పూర్ణము; భేదభావము నిజంబౌ స్థూలరూపంబులన్
బాదలున్కేవల మాత్మయొక్కటిగ నీ పూర్ణార్థమున్ చక్కగా
సదయుండై వచియించె లోకగురుడాశావాదియా ధీరుడై ॥

సత్యమహింసలే బ్రతుకు సాధనకున్ఫలమైన స్వామిగా
సత్యసుజీవనుండగుచు చాలె మహాత్ముడు నేడు; వానికై
నిత్యము సాధనల్నలిపి నేర్పునుజూపెను తర్కవీధి, నా
సత్య విలాసునిన్నరుడు చంపెను తామసియౌట దుర్మతిన్ ॥

మతములకేకత్వ మనురింపబూను ది
వ్యజ్ఞాన సమితి యీ యవనినిండె
సేవక సమితులు చెలగె లోకమునిండ
మానవసేవల మహిమదెలిసి
వసుధ మేధావుల వర్గసదస్సులు
భువన శాంతినిగోరి పొందుపడియె
భూమికంతటికొక పూజ్యన్యాయపదము
భాసిల్లుచుండె ప్రభావమగుచు

బాహ్యమద్వైతసిద్ధికి బాటజేసి
కొనుచు మానవజాతిని కొలుచుచున్న
దివ్యసాత్విక గుణపూర్ణ భవ్యమైన
క్షాత్రయుగమిందు సామ్రాజ్య కాంక్షపండు॥

సేవయే నరునిధర్మము సేవకంటె
పరమధర్మము లేదని నరులుఁ దెలిసి
వెలసి యధికారవాంఛల విడుచునట్టి
పుణ్యకాలము లోపల పుట్టినాము॥

మానవుకొఱకై మరి స
మ్మానములను బొందుకొఱకు మనుజులయందున్
పూనిక గల్గినకాలము
జ్ఞానయుగపుటాది దీనిగతి యబ్బురమౌ॥

విశ్వకావ్యంబుల వెలయించి ఠాగూరు
వన్నెగూర్చెను మానవత్వమునకు
అలనరేంద్రుడు చాటె నఖిల విశ్వమునకు
వేదసారంబుల వింతలెల్ల
అల్ల శంకరుడు సర్వాత్మయే పరమాత్మ
యనుసూత్రమును జాటె నవని మొక్క
గాంధీమహాత్ముడు ఘనసత్య జీవన
మాచరించుచునేర్పె నవనికెల్ల

నల్లపశ్చిమ మందు బెర్నార్డు షాయు
రస్కిన్ టాలస్టాయి మా ఘనులు
మానవత సత్యసాధనా మార్గములను
తెలివి వెలసిరి విశ్వంబు తేజమొంద ॥

సాత్వికపు కాలమందునీసరణి నాల్గు
కులములును బలములు గల్గి వెలయుఘనత
కిదియె క్షాత్ర యుగంబగు నిలనుదీన
నరుడు పరిపక్వదశగాంచు పరముకొఱకు॥

అలరుచు చాతుర్వర్ణము
లిల తమబలములను పెంచి హీనత బాసెన్
అలరు నిక శుద్ధ సత్వం
బలనాడే నరుడు పెరిగి హరిగా మారున్॥



శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# నర - నారాయణ చరితము



## పంచమ సోపానము



### (ఆత్మవికాస పరిణామము)

నరచరితమె హరిచరితము
పరిపూర్ణుండైన నరుడె పరమాత్ముండై
పరుడై నారాయణుడగు
హరియా ప్రభుఁగొలుతు సతము నాత్మోన్నతికై॥

మానవుడాదినుండి క్రమమైన వికాసముగాంచి మించి తా
పూనికసౌఖ్యశాంతులకు పొందిన యాయనుభూతి వాని వి
జ్ఞానముతోడిమానవులు జ్ఞానముతోసరిజూచి తూచియా
జ్ఞానమునిచ్చునెల్లరు వికాసముగాంచుచు శాంతినొందగన్॥

శాస్త్రాలుసాధించు సకల విజ్ఞానము
స్మృతములు సాధించు మంచిగలిపి
బుద్ధినిశోధించి వృద్ధిని గాంచుచు
మనసు మర్మంబుల మధనజేసి
కల్పనాలోకపు గతులను వీక్షించి
సత్కార్థంబుల సరణదెలిసి
సద్గుణంబులకాత్మ సంబంధమును జూచి
బంధనాల్వీడిపోవు బాటదెలిసి

హృదయమును బుద్ధినింబెంచు పదును తెలిసి
పరమశాంతి స్వరూపంబు పారజూచి
సచ్చిదానందమూర్తియు స్వామియగుచు
బ్రాహ్మణుండౌను నరుడువిభ్రాంతి వదలి॥

శుద్ధసాత్త్విక గుణమున శోభగాంచు
భక్తిచేతనె మానవుల్ ముక్తిగాంచు
నూత్నయుగమింక జగమునఁ నొప్పివెలయు
మనసు లరివర్గములగెల్చి ఘనతగాంచు ॥

నరునికి నరునకానాడు దురము లేదు
మనసు రేపు తుపానుల మానవుండు
ఆత్మశక్తితో నణచుచు నద్వితీయ
మధుర భావాలమధ్య నిమగ్నుడగును ॥

చింతలుఁ గల్గబోవు మరిచింతిలకారణముల్నశించు నా
వింతయుగంబు చేరువను వేగమె చేరుచునుండె; నేడు కా
సింత ప్రయత్నమున్నలిపి సేవనెరింగిన మీాదత్యాగమే
ఎంతయు సాయమున్నలుపు నీశుని జేరగమానవాళికిన్॥

వసుధలోపల బుట్టు వారలకెల్లను
వస్తుసమృద్ధులు వరలవలయు
అధికారవాంఛలు నహములు సిగ్గుచే
జనసంఘముల బాసి చనగవలయు
తనతోడి వారి మీాదను పెత్తనము జేయు
మనసు వికారంబు మారవలయు

సత్యజీవనపుప్రశక్తికై యందరు
నడుములు బిగియించి నడువవలయు
నిత్యజీవన నియమముల్ నెగడవలయు
ఎట్టి నిర్బంధములులేని గట్టిదారి
నములురై మన్న నేర్చెడి యట్టిశిక్ష
ణంబు మానవకోటికి నమరవలయు॥

శాంతి దెసకె నేడు చనుచున్నదీ విశ్వ
మంతులేని తపము నాచరించి
యుగయుగాలనుండి జగమున వెలసిన
సత్యమహిమ నిష్ఫలంబుగనునె ? ॥

మతము లన్నిట నేక మతసూత్రజాలముల్
విద్యార్థి నేర్చుచు వెలయునింక
కులజాతి మతభేదములులేని సామాజి
కపు ప్రార్థనములు జగాన వెలయు
సత్యంబహింసలు సకలమానవకోటి
మూలధర్మంబులై మొనయునింక
ప్రేమయే దేవుని ధామంబనెడు సత్య
మెల్లరిహృదయాల నెనయునింక
సంఘమా దేవదేవుని స్థావరమగు
దానిసేవించుటే వాని సేవ యనుచు
నదియె ముక్తికి మార్గమం చఖిల జనులు
నమ్మిచరియించు దినముల నడక వెలయు ॥

రామతీర్థస్వామి రమణీయ తాత్త్విక
బోధలే పూర్ణమై పుట్టునింక
శ్రీరామ కృష్ణుల చిన్మయహాసమే
నరరూపమందుచు వరలబుట్టు
వసుప్రభుని విశ్వాసబలంబిక
దేవుని రాజ్యము దెచ్చినిలుపు
బుద్ధదేవుని దివ్య బోధనాసూత్రమే
మానవరూపాన మహికివచ్చు
సుజనపైగంబర్ల సూక్తులెల్లగలసి
జనులరూపంబున జగతి జేరు
పాపహింసాపథం బవని నంతట నిండి
దయకునిలయమౌచు దనరు నరుడు॥

శంకరాద్వైతమతము నిశ్శంకతోడ
నిండి, పరుడనుభావమే యుండదింక
అల రవీంద్రుని కావ్యార్థ మలలతోడ
నరుల హృదయాలలోఁ బొంగి నాట్యమాడు॥

మనవారె యెల్లవారలు
మనమతమే జగతినిండు మతతతియెల్లన్
మన పెద్ద కుటుంబంబిది
యనుతలపే యెల్లవారి యాత్మల నిలుచున్॥

పగతురు, నాయుధములు నే
పుగ బెరిగిన యుద్ధభటుల పోరులు కోర్టుల్

జగమునసుండవు సేవా
జగమే మానవునియిల్లు శాంతియెకపౌ॥

సాత్త్వికమగు నాహారము
సాత్త్వికజీవనము వెలయు శాంతిపథములో
సాత్త్విక మానవులే యా
తాత్త్విక మర్మములగనుచు దనరుదు రికపై॥

మత్తుపదార్థంబులు ను
న్మత్తులు కన్పడనియట్టి మహితరకాలం
బత్తరి యానందంబే
చిత్తము నుజ్జ్వాతలూగ జేయుచునుండున్॥

సేవకులేగాని జీవులనేడ్పించు
పాలకులుం డరప్పట్టునందు
మాటలమృతమయి మనసులు విషమగు
బాటయేయుండదా వసుధయందు.
కపటజీవనములు కపటయోచనములున్
గతకాలగాథలా కాలమందు
ధర్మశాస్త్రంబులు తగుశిక్షణాశాస్త్ర
ములు సమాధిని జేరి వెలయుభువిని

జగతికొకసేవకాసంస్థ చాలియుండు
దానిశాఖలు భువనంబు లోని దేశ
దేశములునిండియుండును దివ్యముగను
కరువుమాటింక వినిపింపం దరముగాదు॥

వ్యాపారముండదు వ్యాపారులుండరు
అధికారద్రవ్యము లన్నిబోవు;
మానావమానాలు మచ్చునకుండవు
లాభనష్టము లరాదునాడు
కష్టసుఖంబులు కల్పనాకథలప్డు
దండనయనుమాట తప్పునాడు
నిత్యవినీతులు నేర్పుగ్రంథాళియున్
నరులకుచిత్రంపు సరణినాడు

సతతమాత్మోన్నతికిబోవ జాలునట్టి
శిక్షణమె జీవనముతోడ చెలగుఁగడకు
మానవత్వంబునకె చేటు మచ్చుదెచ్చు
రీతులిక ప్రేతభూమిలో పాతకథలు॥

అహమును బెంచెడి బిరుదులు
అహమార్గమునందు వెలయు నాడంబరములో
ఇహమునగానగ రావిక
నహరహమును నరుడు పరము నందుచు వెలయున్॥

సచ్చిదానందమన నేమొ సకలజనులు
నెరిగి దుఃఖాల నెల్లను దరిగిమనుచు
సకలభూతాళి బ్రోచుచు సకలవిశ్వ
క్షేమయత్నంబులొనరింత్రు భూమివెలయ॥

పల్లెపల్లెయునొక్క భవ్యకుటుంబము
అధ్యక్షుడగుదాని కగును పెద్ద

వ్యక్తిస్వార్థమువీడి శక్తితో సంఘముఁ
సేవించు నానాడు చేవతోడ
రోగాలగూర్చెడి భోగాలునశియించు
సాత్వికజీవన సరణిహెచ్చ
దేహబలంబులు దివ్యమైభాసిల్లు
మనసులు విజ్ఞాన మహిమవెలయు

సకల కళలునుదివ్యమై సంతతంబు
నరుని నున్నతపథముల నడుపుచుండు
సత్యము, శివంబు సౌందర్య సారమైన
పూర్ణమానవులానాడు పొడముగాదె॥

కరుణయు సత్యజీవనము జ్ఞానవిలాసమఖండచిత్తముఁ
నిరతవదాన్యమానస మనింద్యకరంబగు వర్తనంబు స
ద్వరపరిపుల్ల ధీరతర భావ ప్రభావ కృతార్థజీవనా
కరులు నరాళి భూసురయుగంబున నెల్లెడవిశ్వమంతటఁ॥

వేదములు నరులకిడిన విధులలోన
వర్ణములు నాశ్రమంబులు వరలుచుండు
నవియునాలుగుమరియును యివియునాల్గు
తొలిశృతము వర్ణములగూర్చు దొడ్డపంథ
సలుపదగు నాశ్రమాచార సరణిగ్రమత॥

ఆదిని బ్రహ్మచర్య మహితాశ్రమవాసియె శూద్రుడౌను తా
వేదవిధాన ధర్మము లభీష్టముఁ దీర గ్రహించి నిత్యసం
పాదిత సచ్ఛరీరఘన భాసిత మానసపూర్ణుడౌచు నిం
పాదిగ నేస్తుడౌపిదప వర్థిలు వైశ్య సుధర్మచారియై॥

స్త్రీధనము భూధనంబును గోధనంబు
కొరకు సత్కర్మరతుడయి కోర్కెలలర
జీవనముఁ జేసి ఋషిపితృ దేవఋణము
లింపుగా దీర్చి ముందున కేగుచుండు॥

క్షాత్రధర్మంబె వానప్రస్థాశ్రమమున
సంతతిని బెంచి పెద్దగా సలిపి వారి
కెల్ల బుద్ధులు నేర్పించి హితముఁ దెల్పి
పెండ్లి పేరంటములు జేసి పిదపవారి
శిరముపై గేస్తుధర్మము వరలనిలిపి
అతిథి యభ్యాగ తార్చన లాచరింప
దెలిపి తననాతితోడుత తీర్థయాత్ర
లాచరించుచు చిత్రాల నన్నిజూచి

విశ్వమునగల్గు యాచార విధముజూచి
కామ్యతతి శాంతిగాంచిన క్షణముఁదెలిసి
బాధ్యతలవీడి పరమాత్మ భావమందు
వెలసి మోక్షంపు మార్గాన నిలుచు నరుడు॥

అంతట సన్యాసాశ్రమ
మంతంబున జేరి కోర్కె లంతరించుపై
వింతగ నరిషడ్వర్గము
జెంతకురానీక స్వామిచెంతకుబోవున్॥

క్రమత ధర్మార్థకామ మోక్షములు నాల్గు
నాలుగాశ్రమములకౌ పునాదిరాళ్లు

గమ్యములు నవ్వియే వాని గడచిగాని
నరుడు శ్రీహరిలోఁజేర నెరవుఁగలదె?॥

ఒక్కొక కాలమునందున
జక్కఁగనివి త్రిగుణప్రకృతి ఛాయలగొనుచున్
ఒక్కొక్క మెట్టుమునందున
కక్కజముగఁ జేర్చునరుని కాత్మగనగుచున్॥

బాలుండు శూద్రుడై బ్రహ్మచారిగనొచు
ధర్మాశ్రితుండునై దనరుచుండు
యువకుండు వైశ్యుడై యొప్పిగృహస్థుడై
యర్థాశ్రితుండునై యలరుచుండు
కౌమారిపుత్రుడై ఘనమైనకీర్తికి
కామ్యాశ్రితుండునై ఘనతగాంచు
వృద్ధుడు బ్రాహ్మణ శ్రద్ధసన్యాసియై
మోక్షావలంబియై ముక్తిగనును

జగతిధర్మార్థకామమోక్షములెనరుని
కరయుపురుషార్థసాధన కౌనటంచు
వేదములుఁదెల్పె; వ్యక్తికై; యేదిశుభమొ
వ్యష్టికదె శుభప్రదమునై వేడ్కనిచ్చు॥

శూద్రయుఁగంబులో సురుచిరమానవ
ప్రకృతి ధర్మంబులు పదునుఁగాంచె
వైశ్యయుగంబులో బాహ్యార్థసంచయాల్
నరునిజీవనములో వరలిపెరిగె

క్షాత్రయుగంబులో కామ్యార్థములు కూడి
మానవ విజ్ఞాన మహిమదనరె
బ్రాహ్మణయుగమున పరమార్థపదమున
నరుడై శ్రీహరియౌచు వరలునింక

చక్రమున చక్రమొప్పిన సరణియుగము
అందుననుపయుగంబులు నమరుక్రమత
యుగములును తిర్గితిర్గి తామున్న మొదటి
స్థానమున జేరుచుండును చక్రమట్లు

ఈ లీలాచక్రంబును
బాలుండై త్రిప్పియాడు పరమాత్ముం డీ
లీలార్థ మెవరెరుంగుదు
రేలోయాప్రభునియిచ్ఛ యేమోయెటులో॥

గీతాశాస్త్రముఁ జెప్పిన
రీతిని స్థితప్రజ్ఞులైన శ్రీమంతులకో
భూతలము నిండు కాలము
వ్రాతలలోనుండి నేడు వసుధకు జేరున్॥

రోగములు లేని కాలము
భోగములో నరులు తృప్తి బొందుచు సతమున్
త్యాగమును జూపియాపై
యోగులుగా వెలయుచుందు రుత్తమగుణులై॥

శీతము వాతం బాతప
మాతరి విజ్ఞానియాజ్ఞ నణగిమణగు నీ

భూతలమువిడుచు తిమిరం
బాతరి నాకంబు భూమియందే వెలయున్

సత్తునసత్తులేమొ గనజాలెడు చీకటి వెల్గురీతుల
న్నత్తరిలో నెరుంగునరు డమృతమున్ మృతమున్ వివేచనన్
చిత్తములో నెరింగికొని చిన్మయుడౌతను మానసంబులన్
క్రొత్తయుగంబు జీవనమునందతిశాంతి విధంబు గూర్పగన్॥

నరుడు చివరకు బడసెడు పరమపదము
సచ్చిదానంద పూర్ణమే శౌరిరూపు
అచట సందేహభయదుఃఖ మనలెలేదు
దాని కేశాంతి యనుపేరు దనరుచుండు॥

ఆపదమొందగా తొలుత నమృతమార్గము దెల్పెవేదముల్
ఆపదలిచ్చుదుఃఖముల కాదియసత్తగు; దానిమీరగా
దీపముగల్గు మార్గమున దీనతలేదు మృతుండుగాక నా
శ్రీపతిలోన జేరుకొను చింతలు నాతరినంతమయ్యెడిన్॥

వికృతినే మృతిగ బల్కిరి విబుధవరులు
ప్రకృతి పరిణామమే దివ్య పదముగూర్చు
తనుమనంబులు రోగముల్ దాటకున్న
నెటులగను ముక్తిజన్మమ్ము లెన్నికైన॥

కాలము పక్వమైనదిక కాలుని దూతల పాలుగాడు స
చ్ఛీలుడు భోగతృప్తుడు సుధీరుడు దివ్యుడు నిత్యతత్వనా
లోలుడు మృత్యులోకముల రాధిక దాటి యమర్త్యుడౌచునా
శ్రీలలనా కుమారుడగు చిన్మయుడై ఘనమోక్షగామియౌ॥

ఆతరి వానికోరికల కంతము కల్గునునిత్యతృప్తుడై
యాతడు కోరుజీవులకు నన్నిటికి న్ఘనశాంతి జేకురన్
పాతకమే యెరుంగని కృపాపరిపూర్ణుడువాడు నాడు యీ
భూతలమెల్ల వానికి ప్రపూర్ణ స్వరూపము;వాడె యాత్మయా॥

సచ్చిదానంద జలధి ప్రశాంతమగుచు
వాని హృదయంబులో పొంగు వారుచుండు
తనుమనంబులు సత్వమై దనరియుండు;
బ్రహ్మచర్యంబు వానిలో పక్వమొందు॥

ఆకలి దప్పుల కడవిమృగాలకు
చలికి వానలకెంతో యులికి యులికి
కామక్రోధాదుల గతిలోన తనతోడి
నరులిడు హింసతో తిరముబాసి
అధికార మమకార మాత్మ ధిక్కారాల
నడకలో నెంతయు నలిగినలిగి
భయమహా నహంకార పదఘట్టనంబున
శ్రమలతో నెంతయో కుమిలికుమిలి
దీనుడై పుట్టి చచ్చుచు తెరలఁదాటి
జ్ఞానియైపూర్ణుడౌచు విజ్ఞానియగుచు
సచ్చిదానందమూర్తియై జనుడునాడు
సృష్టికిప్రభుడు మిగులు సమిష్టికెల్ల
నాత్మయగు వ్యష్టిభావమే యంతరించు॥

అవ్యక్తుడైన శ్రీహరి
అవ్యక్తమువీడినిలుచు నాతనియందుః

అవ్యయుడు నరుడునాడిక
భవ్యత్వముగలిగి వెలయు పరమాత్ముండై
నరులనుగూర్చిపల్కునది నారులకున్నరియాచునొప్పు స
చ్చరితసుశీల సంపదల సామ్యమునందుచు ముక్తిలోపలన్
అరయగ భేదభావముల కాదియిహంబగు; దానిదాటినన్
పరమునలింగభేదముల భావముసున్న సుశాంతిమిన్నయౌ॥

ఓంశాంతి, ఓంశాంతి! ఓంశాంతియనునట్టి
విబుధులవాంఛలు వృథగజనునె
స్వస్తివాచకములు పలికెడి జ్ఞానుల
సంకల్పబలమిడ చప్పబడునె
అందరిశాంతికై యటమటించెడిభక్త
వరులదివ్యేచ్ఛలు జరగకున్నె
భువనశాంతినిగోరు పుణ్యులదీవనల్
మట్టిలోమట్టియై వట్టిదగునె?
దేవదూతలుగాభూమి తేజరిల్లు
శాంతిదూతల యత్నాలు సమసిచనునె?
చనినకాలము మూటగా గొనినపుణ్య
ఫలము బ్రాహ్మణయుగమును నిలుపుజగతి॥
నరుడే నారాయణుడై
యరుదెంచుచున్నకాల మదిగోమెదటన్
తెరదీయుచున్నదిపుడే
పరికింతురు భక్తులైన పావనచిత్తుల్॥
మంగళం శ్రీ శ్రీ శ్రీ

# పరిసమాప్తి

విశ్వమానవులచే వినుతిగాంచిన 'బాపు'
నారాయణుడుగాక నన్యుడగునె ?
నిర్వాణపథమున నిలచిన బుద్ధుడు
నారాయణుడుగాక నన్యుడగునె ?
శిలువపై ప్రాణాల దొరగిన జీసస్సు
నారాయణుడుగాక నన్యుడగునె ?
భక్తితరంగాలబరపు చైతన్యుడు
నారాయణుడుగాక నన్యుడగునె ?

ప్రేమభావంబు రూపమై విశ్వశాంతి
కొఱకు ప్రాణాలనర్పించి తరతరాలు
మానవుల మెప్పుగాంచెడి మాన్యతములు
నరులె ! నారాయణులుగాక యరసిఁ జూడ॥

త్యాగులువానియంశయగు ధన్యులుమానవకోటి శ్రేయ స
ద్యోగప్రకాశవృత్తికి యథోచితవృత్తి శ్రమించిమించి యా
రాగల దివ్యకాలమున రాజిలియాత్మగనెల్లవారి ను
ద్యోగముగూర్చి శాంతిమయమున్నతముక్తిపథంబు జేరగన్

కోట్లప్రజలకు దేవుని గొప్పఁదెలిపి
భక్తులను జేసి వారికి పరముగూర్చు
పావనుడు శ్రీమహమ్మదు వట్టినరుడె?
అల్లనారాయణుడుగాక నన్యమగునె?

తనువుగోలపోక ధనముగోలయుబోక
గొప్పతనపుగోల దప్పకున్న
నాదియన్నగోల నామరూపాలతో
పోక, నరుడుపరము పొందగలడె?

నారాయణునిరూపు నాల్గంతరములుగా
వెలయుచునుండును విశ్వమందు
తనుజీవులకు భువి ఘనసౌఖ్యములనొచు
ధనజీవులకుతానె ధనమునొచు
మానజీవులకుతా మానంబునగుచును
జ్ఞానజీవులకుతాజ్ఞానమగుచు
వ్యక్తరూపముతోడ భాసిల్లుచుండును
అవ్యక్తమగురూపె యలసమాధి

అలసమాధినిగాంచక హరి నిజంబు
తెలియనలవియే ? నరుడెంత ! తెలివిగనిన
అహము, మమతయు నారక నలసమాధి
కలుగునే కలిగినను దాని నిలుప వశమె ?

అహము పండిపండి యటుమీదనాత్మయగా
త్రిగుణపూర్ణమైన జగతిమారు
నపుడువిశ్వమెల్ల నానందసాగర
మట్టియుగమువచ్చు నాగతమున॥

అందునకు తగినపాత్రత
నొందుటకై వ్యక్తికూడ నున్నతభావం

బందుచుముందుకుఁబోవుచు
మందత విడనాడవలయు మంగళకరుడై॥

పదవుల యందున్న వారు సేవాభావ
మున నరు సేవకు పూను నెడల
ఇల కళాజీవి కేవలము నశ్లీలంపు
కళనుండితొలగింప గలుగు నెడల
కవులు సత్యాన్వేషగాములై త్యాగులై
సత్యప్రశస్తిని చాటు నెడల
విజ్ఞానిహింసాత్మ నజ్ఞానశక్తికి
బలిగా కముక్తిని బడయు నెడల
కలిమితో త్యాగ మొకచోట గలుగు నెడల
బల మహింసయు నొకచోట బరగు నెడల
విద్యయు వినయమొకచోట వెలయు నెడల
దూరమగునో శోకా[illegible] యాధర మారుయుగము॥

తనువులెల్లను సత్యప్రపూర్ణమగుత
మనసులెల్లను జ్యోతితో నెనయుగాక
తనువులును మనసులుమృత్యు తరణమగుచు
నరులు నారాయణులుగాగ వరలుగాత॥




ఓం శాంతిః శ్శాంతిః శ్శాంతిః
మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

ఆంజనేయ పవర్ ప్రెస్, ఏలూరు—డిశంబరు 1959 - 1000 ప్రతులు.